## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# నిత్య పారాయణ సుత్తములు



అనువాదం

**చౌడూరి ఉపేంద్రరావు**




**ఆనంద బుద్ధ విహార ట్రస్ట్**

సాయినగర్ : తుకారంగేట్, సికింద్రాబాద్ - 500 017,

ఫోన్ : 0091-40-7732421, ఫ్యాక్స్ : 0091-40-842477

# సుత్త సూచిక

**ధ్యానవర్గము**



# ఆనంద బుద్ధ విహార ట్రస్టు

సాయినగర్ : తుకారాంగేట్, సికింద్రాబాద్

## సందేశం

పాళీ సాహిత్యమెంతో ప్రాచీనమైనది. బుద్ధుని ఉపదేశాలన్నీ ఈ సాహిత్యంలో నిహితమై ఉన్నాయి. నేడు విశ్వవ్యాప్తంగా బౌద్ధంపై ఒక ప్రత్యేకమైన ఆసక్తి పెరుగుతున్నది. బౌద్ధసాహిత్యాంతర్గతమైన అపార తాత్త్విక, ధార్మిక విషయాలను తెలుసుకోవాలన్న కోరిక ప్రపంచంలో నేడు ప్రతీచోట కనబడుతున్నది. తెలుగువారికి బౌద్ధానికి మధ్య ఉన్న సంబంధం ఈనాటిది కాదు. అందుకే సహజంగా తెలుగు వారికీమధ్య బౌద్ధం పట్ల ఆదరాభిమానాలు పెరుగుతున్నాయి. కాబట్టి ప్రాచీన పాళీ గ్రంథాలెన్నో తెలుగు అనువాదాలతో వెలుగుచూడాల్సిన అవసరం నేడెంతగానో ఉన్నది. ముఖ్యంగా తెలుగువారు ప్రతీరోజు పఠించడానికి కొన్ని ప్రసిద్ధ పాళీ సుత్తములు అందుబాటులో ఉండాల్సిన అవసరమెంతైనా ఉంది. ఈ ఉద్దేశ్యంతోనే ఈ గ్రంథాన్ని మీముందుంచుతున్నాము.

నేడు సమాజంలో ప్రబలుతున్న ఎన్నో రుగ్మతలకు మన మానసిక స్థితిగతులే కారణం శారీరకమైన బాధలెన్నో మానసికమైన వత్తిడుల వల్లే సంభవిస్తున్నాయని వైద్యశాస్త్రం చెపుతున్నది. ఇలాంటి స్థితిలో మన మనస్సును ఈ భౌతిక విషయ వాంఛల నుండి కాపాడి ప్రశాంత పరచుకోవడం చాలా అవసరం. మనస్సు సంతులితమైతే ఇక మనకేబాధా ఉండదు. ఈ గ్రంథంలోని వివిధ సుత్తాలను పఠించడం వల్ల మనకు మానసిక ప్రశాంతి చేకూరుతుంది. సాధకులు విశుద్ధ మార్గంలో పయనించగలుగుతారు. సకల సద్గుణ సంపన్నుడైన బుద్ధుడిని, ఉత్కృష్టమైన ధర్మాన్ని, సంఘాన్ని ప్రశంసించే సుత్తాలెన్నో ఈ గ్రంథంలో ఉన్నాయి. వీటిని నిత్యమూ పఠించడం వల్ల త్రిరత్నాలపై శ్రద్ధాసక్తులేర్పడతాయి.

మనలో సత్ప్రవర్తన పెరుగుతుంది. తద్వారా మానసిక ప్రశాంతి చేకూరుతుంది.

ఈ గ్రంథంలో వందనాసుత్తములేకాదు, పరిత్రాణ సుత్తాలు కూడా ఉన్నాయి. ఇవి మనలో ఆత్మస్థైర్యాన్ని పెంచుతాయి. ఇంతేకాదు, ధ్యానోపయోగమైనవి, పూజాసమయంలో పఠించదగినవి అయిన సుత్తములెన్నో ఈ గ్రంథంలో పొందుపరచబడ్డాయి. ఇలా ఈ గ్రంథం ఆకారంలో చిన్నదైనా మనిషికి ఆంతరికదృష్టిని ప్రసాదించి అతడు తన సహజ స్వభావాన్ని తెలుసుకోవడానికి ఎంతగానో ఉపకరిస్తుంది. తల్లిదండ్రులు ఈ గ్రంథంలోని సుత్తాలను తాము చదవడమే కాకుండా తమ పిల్లలచేత కూడా వీటిని ప్రతిరోజు చదివించాలి. బౌద్ధులు బుద్ధవిహారాలకెళ్ళినప్పుడు అక్కడ పఠించడానికిగాను కనీసం కొన్ని పాళీ సుత్తాలైనా వారికి వచ్చి ఉండాలి. ఈ గ్రంథం పై అవసరాలన్నింటినీ తీరుస్తుంది.

ఇక ఈ పాళీ సుత్తాలను తెలుగులోనికి సరళసుందరంగా అనువదించిన శ్రీ చౌడూరి ఉపేంద్రరావు పాళీ భాషా సాహిత్యాలలో మంచి ప్రవేశం సంపాదించాడు. పాళీ సాహిత్యంపై ఒక పుస్తకాన్ని కూడా రచించాడు. యువకుడు, ఉత్సాహవంతుడు అయిన శ్రీ ఉపేంద్ర ముందు ముందు కూడా ఇలాగే పాళీ గ్రంథాలను తెలుగు వారికి అందించగలడని విశ్వసిస్తున్నాను.

అసలు ఇలాంటి పుస్తకమొకటి తెలుగు వారికందిస్తే బాగుంటుందని ఆలోచించి చౌడూరి ఉపేంద్రరావును ప్రోత్సహించి ఈ గ్రంథ ప్రచురణకి ఎంతగానో కృషిచేసిన మా ట్రస్టు ఉపాధ్యక్షులు చెన్నూరు ఆంజనేయరెడ్డిగారు ఎంతో అభినందనీయులు.

తెలుగువారు ఈ గ్రంథాన్ని నిత్యమూ పఠించి కృతకృత్యులగుదురు గాక.

సంఘరక్షిత మహాథేర

2542 బుద్ధజయంతి

హైదరాబాదు

(సంఘ రక్షిత మహాథేర)

# బుద్ధం శరణం గచ్ఛామి

(ఈ గీతం బుద్ధుని జీవిత విశేషాలను క్రమంగా వర్ణిస్తుంది)

మాయాదేవీ గజస్వప్న ఫలం
లుంబినీ వన జాతం
అసిత వచో పరిపూరకం
శాక్యాన్వయాగ్రతారకం

అధిగత సమస్త విద్యానిచయం
యశోధరా ప్రియ వల్లభం
రాహుల జనకం రాగమయం
సకల భోగ పరితోషిత హృదయం

రాజవిథీసు దుఃఖదర్శనం
ఆదౌ ను వృద్ధ యాచకం
పశ్చాత్ వ్యాధి గ్రస్తపూరుషం
తత్పశ్చాన్మృత కళేబరం

పశ్చాత్ దృష్ట్వా యతిం ప్రశాంతం
వైరాగ్య భావనిశ్చలం
విసృష్ట పత్నీ ప్రియసుతం వరం
సత్యమార్గాన్వేషకం

అనశననిందక తథాగత
సత్యధర్మ సందేశక సుగత!
మధ్యమమార్గాన్వేషక బుద్ధ!
ఆర్యసత్య విజ్ఞాన విశుద్ధ!

మృగవనే ప్రథమోపదేశః
మారవిజితాజ్ఞాన నాశక!
వేలువన విఖ్యాతవాసః
బింబిసార ప్రియ వినాయక!

సమస్త లోకాన్సముద్ధర్తుమిహ
నింద్య దుఃఖ సంక్షాలక!
చతుస్త్రింశాని సహస్రాణ్యహో
అద్భుతాని త్వ మదర్శయః

శ్రావస్త్యామద్భుతాని సృష్ట్వా
లోకోద్ధరణ మకార్షీః
సంఘస్థాపక తథాగత!
ధర్మోద్ధారక మహాయశ!

# శైల వర్గము



సకలసద్గుణ సంపన్నుడైన బుద్ధభగవానుడికి వినమ్రభావంతో నమస్కరించాలి.

## వందనా

1. నమో తస్స భగవతో అరహతో
సమ్మాసమ్బుద్ధస్స.

2. నమో తస్స భగవతో అరహతో
సమ్మాసమ్బుద్ధస్స

3. నమో తస్స భగవతో అరహతో
సమ్మాసమ్బుద్ధస్స

# బుద్ధవందనము

1. అర్హతుడు, సమ్యక్‌సమ్బుద్ధుడు అయిన బుద్ధ భగవానుడికి వందనము.

2. అర్హతుడు, సమ్యక్‌సమ్బుద్ధుడు అయిన బుద్ధ భగవానుడికి వందనము.

3. అర్హతుడు, సమ్యక్‌సమ్బుద్ధుడు అయిన బుద్ధ భగవానుడికి వందనము.



మా జీవిత గమనంలో దొర్లే తప్పులను క్షమించు తండ్రీ !

# భన్తే మా దోషాలను క్షమించు !

భగవంతుడిని తమ తప్పులను క్షమించమని అడగడం ఒక ముఖ్యమైన ధార్మిక కృత్యమని చాలామంది భావిస్తారు. కాని బౌద్ధం ఈ విషయాన్ని ఖండిస్తుంది. అందుకే బౌద్ధులలో కొందరు మరి ఈ క్షమాయాచన ఎందుకు అని ప్రశ్నిస్తుంటారు. బుద్ధుని ఎదుట బౌద్ధులీ గాథలను పఠిస్తారు. నిజమే...... కాని వారి తప్పులను క్షమించమని మాత్రం కాదు. వారంతట వారే తమ తప్పులను గుర్తించి వాటిని ఒప్పుకోవడానికి ఈ గాథలను పఠిస్తారు.

నైతిక జీవితానికి స్వస్తి చెప్పి మన ధార్మికోన్నతికి మనమే విఘాతాన్ని కొనితెచ్చుకుంటున్నాము. అసమంజసమైన ఆలోచనలకు మన మనస్సులో స్థానం కల్పించినప్పుడే మనం ఒక పెద్ద తప్పు చేసినవారమౌతాము. సత్య బద్ధమైన ఆలోచనలు ఉదయించడానికి ఈ క్రింది గాథలను పఠించడమెంతో అవసరము. ఆ పఠనము ఒక అనిర్వచనీయమైన ప్రశాంతతనే కాకుండా ఒక విధమైన మానసిక శాంతిని కూడా ప్రసాదించి దోషాలు పునరావృత్తం కాకుండా కాపాడుతుంది. ఈ విధంగా మన ఆలోచనలను వ్యక్తపరచడం వల్ల, మన దోషాలనంగీకరించడం వల్ల మనం ఇతరులనుసైతం ఆధ్యాత్మికోన్నతికై ప్రేరేపించిన వారమౌతాము. ఇలాంటి స్వభావాన్ని గనక మనం పెంచుకోగలిగితే మనం పుణ్యస్థలాలలో నివసించినా నివసించపోయినా, పుణ్యపురుషుల సాన్నిధ్యంలో ఉన్నా ఉండకపోయినా మన ఆలోచనలను, మాటలను, పనులను అన్నింటినీ నియంత్రించుకొనగలుగుతాము.

## ఖమాపన

ఓకాస! ద్వారత్తయేన కతం సబ్బం అపరాధం
ఖమథ మే భన్తే!
అనుకమ్పం ఉపాదాయ.
దుతియంపి ఓకాస! ద్వారత్తయేన కతం సబ్బం అపరాధం
ఖమథ మే భన్తే
అనుకమ్పం ఉపాదాయ.
తతియంపి ఓకాస! ద్వారత్తయేన కతం సబ్బం అపరాధం
ఖమథ మే భన్తే.
అనుకమ్పం ఉపాదాయ.

## సీలయాచనా

ఓకాస! అహం భన్తే తిసరణేన సద్ధిం
పంచసీలం ధమ్మం యాచేమి
అనుగ్గహం కత్వా సీలం దేథ మే భన్తే!
అనుకమ్పం ఉపాదాయ.
దుతియం పి ఓకాస! అహం భన్తే తిసరణేన సద్ధిం
ధమ్మం యాచేమి
అనుగ్గహం కత్వా సీలం దేథ మే భన్తే
అనుకమ్పం ఉపాదాయ.

## క్షమాయాచన

భన్తే! శరీరము, మాటలు, మనస్సు అనే ఈ ద్వారత్రయంతో నేను చేసిన తప్పులన్నింటినీ దయచేసి క్షమించు.

రెండవసారి కూడా భన్తే శరీరము మాటలు మనస్సు అనే ఈ ద్వారత్రయంతో నేను చేసిన తప్పులన్నింటినీ దయచేసి క్షమించు.

మూడవసారి కూడా భన్తే శరీరము, మాటలు, మనస్సు అనే ఈ ద్వారత్రయంతో నేను చేసిన తప్పులన్నింటినీ దయచేసి క్షమించు.

## శీలయాచనము

భన్తే! త్రిశరణములతో సహ పంచశీలను, ధర్మాన్ని నాకిమ్మని వేడుకుంటున్నాను. నాపై అనుగ్రహంతో భన్తే దయచేసి నాకు శీలాన్ని ప్రసాదించు.

రెండవసారి కూడా భన్తే! త్రిశరణములతో సహ పంచశీలను, ధర్మాన్ని నాకిమ్మని వేడుకుంటున్నాను. నాపై అనుగ్రహంతో భన్తే! దయచేసి నాకు శీలాన్ని ప్రసాదించు.

మూడవసారి కూడా భన్తే! త్రిశరణములతో సహ పంచశీలను, ధర్మాన్ని నాకిమ్మని వేడుకుంటున్నాను. నాపై అనుగ్రహంతో భన్తే! దయచేసి నాకు శీలాన్ని ప్రసాదించు.



ఎందరో మహనీయులు బుద్ధుడిని శరణువేడుకొని అతడి శిష్యులుగా మారారు.

# త్రిశరణములు

బౌద్ధులు కావాలనుకొనేవారు బుద్ధుడిని, అతడి ధర్మమును, సంఘమును శరణుజొచ్చాలి. బౌద్ధులైన వారు కూడా వారి నిత్య జీవితంలో ఈ త్రిశరణాలను మళ్ళీ మళ్ళీ చదవాలి.

బుద్ధుడు పరమ పవిత్రుడు. అతిసద్గుణవంతుడు. పరిపూర్ణ ధార్మిక తేజోమూర్తి. అతడు ప్రవచించిన ధర్మం మానవ జీవితాన్ని, లోకపు సహజ స్వభావాన్ని విశదీకరిస్తుంది. అది విశ్వజనీనము, నిత్యసత్యము అయినటువంటిది. ఇక సంఘమంటే స్థితప్రజ్ఞులైన బుద్ధుని శిష్య సముదాయము. అంతేకాదు సంఘమంటే బుద్ధుని పవిత్ర ధార్మిక జీవన విధానము. ఇందులోని సభ్యులంతా ధార్మిక జీవనాన్ని గడిపేవారు. మూలబుద్ధోపదేశాలను సంరక్షించేవారు.

ఈ త్రిశరణాలను శరణుజొచ్చినంత మాత్రాన మనం వాటికి మానసికంగా దాసులమై పోయినామని భావించరాదు. నిజానికి ధార్మికోన్నతిని సాధించాలనుకున్నవారికి మార్గనిర్దేశన మెంతో అవసరం. అంతమాత్రాన మనిషి స్వతంత్రంగా ఆలోచించే శక్తిని కోల్పోకూడదు. ధర్మం పేరుతో,మతం పేరుతో చెప్పిన ప్రతీవిషయాన్ని పాటించవలసిన అవసరం కూడా లేదు. తన స్వంత ప్రతిభను మేళవించి ఏది యోగ్యమైనదో దాన్నే ఆచరించాలి.

ప్రతీమతానికి కొన్ని పవిత్రమైన లక్ష్యాలుంటాయి. ఆ మతాన్ని అనుసరించేవారికి ఆ లక్ష్యాలపై విశ్వాసముండాలి. ఇలా విశ్వాసంతో, ఉత్సాహంతో వాటిని ఆమోదించినట్లైతే అవి మనుష్యులలో దాగిఉన్న ఆంతరిక శక్తిని జాగృత పరిచి, ధార్మిక జీవనం కొనసాగించేందుకు వారిని ప్రేరేపిస్తాయి.

## తిసరణ

బుద్ధం సరణం గచ్ఛామి
ధమ్మం సరణం గచ్ఛామి
సంఘం సరణం గచ్ఛామి

దుతియమ్పి బుద్ధం సరణం గచ్ఛామి
దుతియమ్పి ధమ్మం సరణం గచ్ఛామి
దుతియమ్పి సంఘం సరణం గచ్ఛామి

తతియమ్పి బుద్ధం సరణం గచ్ఛామి
తతియమ్పి ధమ్మం సరణం గచ్ఛామి
తతియమ్పి సంఘం సరణం గచ్ఛామి

# త్రిశరణములు

బుద్ధుడిని శరణు జొచ్చుచున్నాను.
ధర్మమును శరణుజొచ్చుచున్నాను.
సంఘమును శరణుజొచ్చుచున్నాను.

రెండవసారి బుద్ధుడిని శరణు జొచ్చుచున్నాను.
రెండవసారి ధర్మమును శరణు జొచ్చుచున్నాను.
రెండవసారి సంఘమును శరణు జొచ్చుచున్నాను.

మూడవసారి బుద్ధుడిని శరణు జొచ్చుచున్నాను.
మూడవసారి ధర్మమును శరణు జొచ్చుచున్నాను.
మూడవసారి సంఘమును శరణు జొచ్చుచున్నాను.

# పంచశీల

ఈక్రింది సుత్తాన్ని ప్రతీరోజు ఉదయము, రాత్రి పఠించాలి. బౌద్ధసభలు, సమావేశాలు ప్రారంభించే ముందుకూడా ఈ పంచశీలను పఠించవచ్చు. వారి వారి బాధ్యతలను నిర్వహించేటప్పుడు బౌద్ధులు వీటిని తమ జీవితంలో ఆచరణలో పెట్టాలి.

వీటిని ఒక ఆజ్ఞగా భావించకుండా స్వచ్ఛందంగా పాటించాలి. అదేవిధంగా వారొకవేళ వీటిని పాటించనట్లైతే దైవికమైన దండన ఉంటుందని కూడా భావించకూడదు. కాని ఒక్కవిషయం మాత్రం నిజం. ఈ పంచశీలములను త్యజించినవారు కార్యకారణాత్మకమైన ప్రాకృతిక నియమాలననుసరించి దుష్ఫలితాలననుభవించక తప్పదు. కాబట్టి ప్రతీబౌద్ధుడు అనునిత్యం వీటిని పాటించాలి.

బౌద్ధులీ పంచశీలను పాటిస్తే వారి జీవితాలు శాంతమయ మవటమేకాకుండా ఇతరులకు కూడా వారి జీవితం ఆదర్శవంతమౌతుంది. ఇంటిచుట్టూరా ఉన్న కంచె ఇంటిని రక్షించినట్లు ఈ పంచశీల ప్రాపంచిక విషయజాలం నుండి మనిషిని రక్షిస్తుంది. శీలరహితుడైన వ్యక్తి తనకేకాదు, సంపూర్ణ సమాజానికే ఒక ఉపద్రవం వంటివాడు.

ఈ పంచశీల ప్రతీబౌద్ధుడిని ఐదు ప్రధాన దిశలవైపుకి తీసుకెళ్తుంది. మొదటి నియమం కోపాన్ని నియంత్రిస్తుంది. రెండవది భౌతిక వాంఛలను నియంత్రిస్తుంది. మూడవది శారీరిక విషయ వాంఛలను నియంత్రిస్తుంది. ఐదవది దురలవాట్లను నియంత్రిస్తుంది.

ఈ ఐదు ఉపదేశాలు పరస్పరపూరకాలు, మనిషిలో సద్గుణాలను పెంపొందించేవి. మొదటిదానివల్ల దయ ఉదయిస్తుంది. రెండవదానివల్ల దాతృత్వము, సంగరాహిత్యము ఉదయిస్తాయి. మూడవదానివల్ల తృప్తి, నాల్గవదానివల్ల సత్యసంధత, ఐదవదానివల్ల చిత్తనైర్మల్యము, నిశ్చలత్వమూ సిద్ధిస్తాయి.

నైతిక, ధార్మిక ఉన్నతులను కోరే ప్రతీబౌద్ధుడూ ఈ ఐదు ఉపదేశాలను పాటించాలి. నైతికత్వమే శాశ్వత ఆనందధామానికి తొలిమెట్టు. ఇదే ధార్మిక జీవనానికి కూడా పునాది. ఈ పునాదిలేనిదే మనుష్యజాతికి ప్రగతి శూన్యము.

నైతికత్వమనే పునాది ఏర్పడ్డ తరువాత మనిషి జ్ఞానంవైపు పురోగమించాలి. ఈ ప్రయత్నమతన్ని అతిక్రింది స్థాయినుండి పై స్థాయి వరకు తీసుకెళ్ళి అతని మనో వికాసానికి, సంపూర్ణతకు దోహదపడుతుంది. చివరికదే అతడికి నిర్వాణాన్ని కూడా ప్రసాదిస్తుంది.

# పంచసీల

1. పాణాతి - పాతా వేరమణి సిక్ఖాపదం సమాదియామి.
2. అదిన్నాదానా వేరమణి సిక్ఖాపదం సమాదియామి.
3. కామేసు మిచ్ఛా - చారా వేరమణి సిక్ఖాపదం సమాదియామి.
4. ముసావాదా వేరమణి సిక్ఖాపదం సమాదియామి
5. సురా - మేరయమజ్జ - పమాదట్ఠానా వేరమణి సిక్ఖాపదం సమాదియామి.

# పంచశీల

1. ప్రాణులను చంపకూడదు (హింసించకూడదు) అన్న నియమాన్ని నేను స్వీకరిస్తున్నాను.

2. ఇవ్వబడని వాటిని తీసుకోకూడదు అన్న నియమాన్ని నేను స్వీకరిస్తున్నాను.

3. శారీరక దుర్వాంఛలకు దూరంగా ఉండాలి అన్న నియమాన్ని నేను స్వీకరిస్తున్నాను.

4. అసత్యం పలకకూడదు అన్న నియమాన్ని నేను స్వీకరిస్తున్నాను.

5. మత్తునిచ్చే సురాపానాన్ని, మేరయపానాన్ని, మద్యపానాన్ని వదలివేయాలి అన్న నియమాన్ని నేను స్వీకరిస్తున్నాను.



శీల సంపత్తితో మనిషి వ్యక్తిత్వం ఉన్నతమై పద్మంలా ప్రకాశిస్తుంది.

# అష్టాంగశీలము

బౌద్ధదేశాలలో బౌద్ధులు పౌర్ణమినాడు, విదియనాడు, పొద్దుపొడవక ముందే మందిరానికెళ్ళి ఈ ఎనిమిది విధాలైన నియమాలను పాటిస్తూ ఒకరోజంతా అక్కడే ఉంటారు. తీరికలేని ఈ నిత్యజీవితం నుండి వైదొలగి ఒకరోజు ప్రశాంతంగా ధార్మిక సాధనలో గడపడమే దీనివెనక ఉన్న పరమార్థం. దీనివల్ల వారికి మానసిక ప్రశాంతి లభిస్తుంది.

ప్రతీబౌద్ధుడు ఈ ఎనిమిది నియమాలను ఎల్లప్పుడూ పాటించాల్సిన అవసరం లేదు. పక్షానికొక రోజు వీటిని పాటించి, మళ్ళీ నిత్యజీవితంలోకి ప్రవేశించవచ్చు. అప్పుడప్పుడు ఇలా మనస్సుకి క్రమశిక్షణ, ప్రశాంతత అలవడితే దానిలో ఐహిక వాంఛలేవీ ప్రవేశించవు. తద్వారా మనస్సు నిశ్చలంగా ఉండగలుగుతుంది.

మన జీవితంలో మనమనుభవించే అనేకానేక వినోదాలు, సుఖాలు మనలో కోరికలను పెంచి మన ధార్మికోన్నతిని నిరోధించేవే. కాబట్టి మనిషి ఇలా తనను తాను పదేపదే నియంత్రించుకొనకపోతే అతడికి శాంతి లభించదు. కోరికలు తీరనప్పుడు మనిషి నిలద్రొక్కుకోవడానికి ఈ అష్టాంగశీలాభ్యాసమెంతగానో ఉపకరిస్తుంది. ప్రాపంచిక సుఖాలనొదిలివేసిన బౌద్ధభిక్షువులు, భిక్షుణిలు వీటిని నిత్యమూ పాటించాలి. గృహస్థులైన బౌద్ధులు వీటిని అప్పుడప్పుడు పాటించవచ్చు.

# అట్ఠంగసీల

1. పానాతి పాతా వేరమణి సిక్ఖాపదం సమాదియామి
2. అదిన్నాదానా వేరమణి సిక్ఖాపదం సమాదియామి
3. అబ్రహ్మచరియా వేరమణి సిక్ఖాపదం సమాదియామి
4. ముసావాదా వేరమణి సిక్ఖాపదం సమాదియామి.
5. సురామేరయ-మజ్జపమాదట్ఠానా వేరమణి సిక్ఖాపదం సమాదియామి
6. వికాల - భోజనా వేరమణి సిక్ఖాపదం సమాదియామి
7. నచ్చ గీత వాదిత విసూక దస్సన మాలా గన్ధ విలేపన ధారన మండన - విభూసనట్ఠానా వేరమణి సిక్ఖాపదం సమాదియామి
8. ఉచ్చాసయన-మహాసయనా వేరమణి సిక్ఖాపదం సమాదియామి.

## ఎనిమిది నియమాలు

1. ప్రాణులను హింసించకూడదు అన్న నియమాన్ని స్వీకరిస్తున్నాను.
2. ఇవ్వబడని వాటిని తీసుకోకూడదు అన్న నియమాన్ని స్వీకరిస్తున్నాను.
3. బ్రహ్మచర్యాన్ని పాటించవలెను అన్న నియమాన్ని స్వీకరిస్తున్నాను.
4. అసత్యం పలకకూడదు అన్న నియమాన్ని స్వీకరిస్తున్నాను.
5. మత్తునిచ్చే సురాపానాన్ని, మేరయపానాన్ని, మద్యపానాన్ని, వదలివేయాలి అన్న నియమాన్ని స్వీకరిస్తున్నాను.
6. అయుక్తమైన సమయాలలో ఆహారాన్ని తీసుకోకూడదు అన్న నియమాన్ని స్వీకరిస్తున్నాను.
7. నృత్యము, గీతము, వాద్యము, చూడకూడనివాటిని, మాలలను ధరించడం, గంధాన్ని పూసుకోవడం వంటి వాటిని పూర్తిగా వదలివేయాలి అన్న నియమాన్ని స్వీకరిస్తున్నాను.
8. ఎత్తైన, సుఖమైన ఆసనాలను వదలివేయాలి అన్న నియమాన్ని స్వీకరిస్తున్నాను.

# దససీల

1. పాణాతిపాతా వేరమణి సిక్ఖాపదం సమాదియామి
2. అదిన్నాదానా వేరమణి సిక్ఖాపదం సమాదియామి
3. అబ్రహ్మచరియా వేరమణి సిక్ఖాపదం సమాదియామి
4. ముసావాదా వేరమణి సిక్ఖాపదం సమాదియామి
5. సురా-మేరయ-మజ్జ-పమాదట్ఠానా వేరమణి సిక్ఖాపదం సమాదియామి.
6. వికాల భోజనా వేరమణి సిక్ఖాపదం సమాదియామి
7. నచ్చగీత వాదిత - విసూక దస్సనా వేరమణి సిక్ఖాపదం సమాదియామి
8. మాలా-గన్ధ-విలేపన-ధారన-మణ్డన విభూసనట్ఠానా వేరమణి సిక్ఖాపదం సమాదియామి.
9. ఉచ్చాసన-మహాసయనా వేరమణి సిక్ఖాపదం సమాదియామి
10. జాతరూప-రజత-పటిగ్గహనా వేరమణి సిక్ఖాపదం సమాదియామి.

## దశ శీలములు

1. ప్రాణులను హింసించకూడదు అన్న నియమాన్ని స్వీకరిస్తున్నాను.
2. ఇవ్వబడని వాటిని తీసుకోకూడదు అన్న నియమాన్ని స్వీకరిస్తున్నాను.
3. బ్రహ్మచర్యాన్ని పాటించవలెను అన్న నియమాన్ని స్వీకరిస్తున్నాను.
4. అసత్యం పలకకూడదు అన్న నియమాన్ని స్వీకరిస్తున్నాను.
5. మత్తునిచ్చే సురాపానాన్ని, మేరయపానాన్ని, మద్యపానాన్ని, వదలివేయాలి అన్న నియమాన్ని స్వీకరిస్తున్నాను.
6. అయుక్తమైన సమయాలలో ఆహారాన్ని తీసుకోకూడదు అన్న నియమాన్ని స్వీకరిస్తున్నాను.
7. నృత్యము, గీతము, వాద్యము, చూడకూడనివాటిని పూర్తిగా వదలివేయాలి అన్న నియమాన్ని స్వీకరిస్తున్నాను.
8. మాలలను, ధరించడం, గంధాన్ని పూసుకోవడం, వివిధ ఆభరణాలతో అలకరించుకోవడం వంటి వాటిని వదలిపెట్టాలి అన్న నియమాన్ని స్వీకరిస్తున్నాను.
9. ఎత్తైన, సంఖవంతమైన ఆసనాలను వదలి వేయాలి అన్న నియమాన్ని స్వీకరిస్తున్నాను.
10. బంగారము వెండి వంటి విలువైన వస్తువులను తీసుకొనగూడదు అన్న నియమాన్ని స్వీకరిస్తున్నాను.



భయంకరమైన దుఃఖముల నుండి ముక్తిని ప్రసాదించేది బుద్ధ వందనమే.



బుద్ధ = ధర్మ = సంఘాలను శరణువేడడం వల్ల సర్వ సమస్యలూ దూరమౌతాయి.

# త్రిరత్న వందనము

(బుద్ధుడు, ధర్మము, సంఘము అనే మూడు రత్నములకు వందనము)

బుద్ధుడు, ధర్మము, సంఘము అన్న త్రిరత్నాలను గౌరవిస్తూ ఈ గాథలను పఠించాలి. ఈ గాథలు త్రిరత్నాల శ్రేష్ఠగుణాలను కీర్తిస్తాయి. వాటిని పఠించడంద్వారా వ్యక్తికి తన అంతఃకరణంలో త్రిరత్నాలపై అచంచలమైన విశ్వాసం కలుగుతుంది.

త్రిపిటకాలలో ఈ గాథల మాహాత్మ్యాన్ని బుద్ధుడు స్వయంగా వర్ణించాడు. జీవితంలో భయము, అశాంతి వంటివి అలుముకున్నప్పుడు ఎవరైనా ఈ గాథలను పఠించి, తద్వారా తమ బాధలను తొలగించు కొనవచ్చని బుద్ధుడే స్వయంగా చెప్పాడు. ఎందుకంటే బుద్ధుడు, ధర్మము, సంఘము ఈ మూడు సంపూర్ణంగా భయాతీతమైనవి, శాంతిప్రదమైనవి. ఈమూడింటిలో దోషాలుగాని, లోపాలుగాని ఉండవు. అందుకే త్రిరత్నాలను స్తుతించడం ద్వారా మనిషి సుఖంగా ఉండగలుగుతాడు.

బుద్ధుడి ఆలోచనానుసారంగా భయము, అశాంతి వంటివి కలిగినప్పుడు ఇతరదేవతలను స్తుతించేవారికి ఆ దేవతలే భయగ్రస్తులని, అశాంతిమయులని తెలియదు. వారే కోరికలను, అజ్ఞానాన్ని అధిగమించని స్థితిలో ఉన్నప్పుడు ఇక ఇతరుల శోకాన్నెలా పోగొట్టగలుగుతారు? కాబట్టి మనిషి ఆత్మస్థైర్యానికై సర్వదా బుద్ధ, ధర్మ, సంఘాలను స్తుతించాలి.

## బుద్ధవందనా

ఇతిపి సో భగవా అరహం
సమ్మాసమ్బుద్ధో
విజ్జాచరణ సమ్పన్నో
సుగతో లోకవిదు అనుత్తరో
పురిసదమ్మసారథి
సత్థా దేవమనుస్సానం బుద్ధో భగవాతి

## నవ గుణ గాథా

1. అరహం అరహోతి నామేన
అరహం పాపం న కారయే
అరహత్తఫలం పత్తో
అరహం నామ తే నమో

2. సమ్మాసమ్బుద్ధ ఞాణేన
సమ్మా సమ్బుద్ధ దేసనా
సమ్మాసమ్బుద్ధ లోకస్మిం
సమ్మాసమ్బుద్ధ తే నమో.

3. విజ్జా చరణ సమ్పన్నో
తిస్సో విజ్జా చరసిరా
ఆకాసాగమనప్పత్తో
విజ్జాచరణ తే నమో

## బుద్ధవందనము

అర్హతుడైన బుద్ధ భగవానుడు దివ్యగుణ పరిపూర్ణుడు. సమ్యక్‌సమ్బుద్ధుడు. విద్య, దానికి తగిన ఆచరణ కలవాడు. అతడు సుగతుడు, అన్ని లోకములగురించి తెలిసినవాడు. బుద్ధభగవానుడు లోకంలోని ప్రతీవ్యక్తికి ధర్మాన్ని బోధించి వారిని ముందుకు నడిపించడంలో అగ్రగణ్యుడు. (అందుకే అతడు) దేవతలకు, మనుష్యులకు కూడా ఆచార్యుడు.

## నవగుణగాథ

1. బుద్ధుడు అన్నింటికి అర్హుడు. కాబట్టి అతడు అర్హతుడు. ఏకాంతంలో కూడా, రహస్యంగా కూడా అతడు పాపం చేయడు. అందుకే అతడు అర్హత ఫలాన్ని పొందాడు. అలాంటి ఓ అర్హతుడా, నీకిదే నా నమస్కారము.
2. అతడు సమ్యక్ సమ్బుద్ధుడు. అతడి ఉపదేశాల వలన, జ్ఞానం వలన అతడు సమ్యక్ సమ్బుద్ధుడయ్యాడు. లోకంలో సమ్యక్ సమ్బుద్ధుడు అతడే. అటువంటి ఓ సమ్యక్ సమ్బుద్ధుడా నీకిదే నా నమస్కారము.
3. బుద్ధుడు చదువు, దానికి తగ్గ జ్ఞానము కలిగినవాడు. అతడి విద్య ఏమిటో లోకమెరిగినదే. అతడికి జరిగిన, జరగబోయే విషయాలన్నీ తెలుసు. అటువంటి విద్యాచరణ సమ్పన్నుడా నీకిదే నా నమస్కారము.

4. సుగతో సుగతత్తానం
సుగతో సుందరం పి చ
నిబ్బానం సుగతిం యన్తి
సుగతో నామ తే నమో

5. లోకవిదూతి నామేన
అతీతానాగతే విదూ
సఙ్ఖార సత్త మోకాసే
లోకవిదూ నామ తే నమో

6. అనుత్తరో ఞానసీలేన
యో లోకస్స అనుత్తరో
అనుత్తరో పూజ లోకస్మిం
తం నమస్సామి అనుత్తరో.

7. సారథీ సారథీ దేవా
యో లోకస్స సుసారథీ
సారథీ పూజ లోకస్మిం
తం నమస్సామి సారథీ

8. దేవయక్ఖ మనుస్సానం
లోకే అగ్గఫలం దదం
దదన్తం దమయన్తానం
పురిసా జఞ్ఞ తే నమో

9. భగవా భగవా యుత్తో
భగ్గం కిలేస వాహతో
భగ్గం సంసార ముత్తారో
భగవా నామ తే నమో

4. బుద్ధుడు అత్యంత క్రమశిక్షణ కలిగినవాడు. అతడే సుగతుడు, సుందరుడు కూడా. అతడు శ్రేష్ఠమైన నిర్వాణాన్ని పొందాడు. అటువంటి ఓ సుగతుడా, నీకిదే నానమస్కారము.

5. అతడి పేరు లోకవిదుడు. అతడికి అతీత అనాగతాలు తెలుసు. వస్తువుల గురించి, ప్రాణుల గురించి, ఆకాశం గురించి అతడికి తెలుసు. అటువంటి లోకమునెరిగినవాడా, నీకిదే నా నమస్కారము.

6. జ్ఞాన-శీలములలో బుద్ధుడు తిరుగులేనివాడు. లోకంలో అతడికి సాటి ఎవ్వరూ లేరు. నిఖిల విశ్వంలో నిరుపమానుడిగా పూజింపబడేవాడతడే. అటువంటి నిరుపమ ప్రజ్ఞాశాలిని నమస్కరిస్తున్నాను.

7. దేవతలను నడిపించు సారథి అతడే. సమస్త విశ్వానికీ సారథి అతడే. లోకంలో పూజనీయుడైన సారథి అతడే. ఆ పూజ్యసారథిని నమస్కరిస్తున్నాను.

8. సమస్త విశ్వంలోని దేవతలకు, యక్షులకు, మనుష్యులకు ఫలాన్నిచ్చేదతడే. మానసిక కాలుష్యాన్ని దమించే వారికే ఫలప్రదాత అతడు. మనుష్యులను, వారి స్వభావాన్ని తెలిసిన ఓ పూజ్యుడా, నీకిదే నా నమస్కారము.

9. బుద్ధభగవానుడు భాగ్యపరిపూర్ణుడు. అతడు అన్ని కోరికలనూ జయించినవాడు. అతడు సంసారసాగరాన్ని దాటినవాడు. అటువంటి బుద్ధ భగవానుడికిదే నా నమస్కారము.

## ధమ్మ వందనా

స్వాక్ఖాతో భగవతా ధమ్మో
సన్దిట్ఠికో అకాలికో
ఏహి పస్సికో ఓపనయికో
పచ్చత్తం వేదితబ్బో విఞ్ఞుహి తి

## సంఘవందనా

సుపటిపన్నో భగవతో
సావకసంఘో
ఉజు పటిపన్నో భగవతో
సావకసంఘో
ఞాయ పటిపన్నో భగవతో
సావకసంఘో
యదిదం చత్తారి పురిస యుగాని
అట్ఠ పురిస పుగ్గలా
ఏస భగవతో సావకసంఘో
ఆహునేయ్యో పాహునేయ్యో
దక్ఖిణేయ్యో అంజలి కరణీయో
అనుత్తరం పుఞ్ఞక్షేత్తం లోకస్సాతి

## ధర్మవందనము

బుద్ధభగవానుడు ధర్మాన్ని చక్కగా వివరించాడు. ఈ ధర్మాన్ని అనుసరించేవారికి ఆత్మపరీక్ష అవసరం. ఇది సర్వకాల సర్వావస్థలయందు ఉండేది. ఈ ధర్మాన్ని తెలుసుకోవాలనుకున్న వారంతా దీన్ని సమీపించి విశదంగా పరీక్షించవచ్చు. అందరూ ఇందులో ప్రవేశించవచ్చు. జ్ఞానులైన వారంతా ఈ ధర్మాన్ని తామే స్వయంగా తెలుసుకొన గలుగుతారు.

## సంఘవందనము

బుద్ధభగవానుడి శ్రావకసంఘము సత్ప్రవర్తన గలది. ఋజు ప్రవర్తన గలది. న్యాయసమ్మతమైన నడవడిక గలది. బాధ్యతతో వ్యవహరించేది.

ఈ నాలుగు జతల మనుష్యులు పూజనీయులు, ఆతిథ్యమునకు యోగ్యులు. కానుకలకర్హులు. గౌరవపూర్వక వందనమునకర్హులు. సమస్తలోకమునకు నిరుపమ పుణ్యక్షేత్రమిదే.



సర్వ శక్తివంతులైన బుద్ధుల వందనము పుణ్యములను సమకూరుస్తుంది.

# అష్టావింశతి బుద్ధవందనము

ప్రపంచంలో వివిధ సమయాలలో ఆవిర్భవించిన 28 మంది బుద్ధులను స్తుతించడానికి ఈ క్రింది గాథలను పఠించాలి. బౌద్ధశాస్త్రాలలో వీరి పేర్లు సురక్షితంగా ఉన్నాయి. బుద్ధుడు సృష్టిలోని అతీత సమయంలోకి పయనించి అసంఖ్యాకములైన పూర్వబుద్ధుల జీవితాలను తెలుసుకున్నాడు. గతంలోని బుద్ధులసంఖ్య అనంతం. వారందరిలో మనకు తెలిసినది కేవలం 28 మందిగురించే. ఆ 28 మందిలో కూడా వర్తమాన ప్రపంచంలో జన్మించినవారు నలుగురే. వారిలో నాలుగవవాడు గౌతమబుద్ధుడు. అతడి ఉపదేశాలనే మనమీ నాడు అనుసరిస్తున్నాము. ఇప్పుడు కొనసాగుతున్న ఈ ప్రపంచంలోనే కొంతకాలం గడిచాక మరొక బుద్ధుడవతరిస్తాడు. అతడే మైత్రేయ బుద్ధుడు. అప్పుడు ఈ వర్తమాన ప్రపచంలో జన్మించిన బుద్ధులు ఐదుగురౌతారు. దీనితో, భవిష్యత్తులో ప్రళయం సంభవించి ప్రపంచమంతా నశించిపోతుందన్న విషయాన్ని బౌద్ధులు ఒప్పుకొనరని స్పష్టమౌతుంది.

పైన చెప్పిన బుద్ధులనందరినీ బౌద్ధులు పూజిస్తారు. నిజానికీ బుద్ధులంతా గౌతమబుద్ధునివంటివారే. వారంతా శాక్యమునియైన గౌతమ బుద్ధుడిలా శాశ్వత నిత్యసత్యాన్ని (ధర్మాన్ని) తెలుసుకున్నవారే.

## అట్ఠవీసతి బుద్ధవందనా

1. వన్దే తన్హంకరం బుద్ధం
   వన్దే మేధంకరం మునిం
   సరనంకరం మునిం వన్దే
   దీపంకరం జినం నమే.
2. వన్దే కొణ్డఞ్ఞ సత్థారం
   వన్దే మంగల నాయకం
   వన్దే సుమన సమ్బుద్ధం
   వన్దే రేవత నాయకం.
3. వన్దే సోభిత సమ్బుద్ధం
   అనోమదస్సి మునిం నమే
   వన్దే పదుమ సమ్బుద్ధం
   వన్దే నారద నాయకం
4. పదుముత్తరం మునిం వన్దే
   వన్దే సుమేధనాయకం
   వన్దే సుజాతం సమ్బుద్ధం
   పియదస్సి మునిం నమే.



# అష్టావింశతి బుద్ధవందనము

1. మహాజ్ఞానియైన తన్హంకర బుద్ధుడిని నమస్కరిస్తున్నాను. మేధంకరుడైన ఆ మునిపుంగవున్ని నమస్కరిస్తున్నాను. శరణంకరుడైన ఆ మునిని నమస్కరిస్తున్నాను. దీపంకరుడైన ఆ జినుడిని (బుద్ధుడిని) నమస్కరిస్తున్నాను.

2. శాస్త అయిన ఆ కౌండిన్యుడిని నమస్కరిస్తున్నాను. నాయకుడైన ఆ మంగళుడిని నమస్కరిస్తున్నాను. సమ్యక్ సమ్బుద్ధుడైన ఆ సుమనుడిని నమస్కరిస్తున్నాను. నాయకుడైన ఆ రేవతుడిని నమస్కరిస్తున్నాను.

3. సమ్యక్ సమ్బుద్ధుడైన శోభితుడిని నమస్కరిస్తున్నాను. మునియైన అనోమదస్సిని నమస్కరిస్తున్నాను. సమ్యక్సమ్బుద్ధుడైన పదుముడిని నమస్కరిస్తున్నాను. నాయకుడైన ఆ నారదుడిని నమస్కరిస్తున్నాను.

4. ముని పదుముత్తరున్ని నమస్కరిస్తున్నాను. నాయకుడైన సుమేధుడిని నమస్కరిస్తున్నాను. సమ్యక్ సమ్బుద్ధుడైన సుజాతుడిని నమస్కరిస్తున్నాను. ముని పియదస్సిని నమస్కరిస్తున్నాను.

5. అత్థదస్సి మునిం వన్దే
ధమ్మదస్సి జినం నమే
వన్దే సిద్ధత్థ సత్థారం
వన్దే తిస్స మహామునిం

6. వన్దే పుస్స మహావీరం
వన్దే విపస్సినాయకం
సిఖి మహామునిం వన్దే
వన్దే వేస్సభునాయకం

7. కకుసన్ధం మునిం వన్దే
వన్దే కొనాగమ నాయకం
కస్సపం సుగతం వన్దే
వన్దే గోతమ నాయకం

8. అట్ఠ విసతి' మే బుద్ధా
నిబ్బాన మత దాయకా
నమామి సిరసా నిచ్చం
తే మం రక్ఖన్తు సబ్బదా

5. ముని అత్థదస్సిని నమస్కరిస్తున్నాను. విజయుడైన ధమ్మదస్సిని నమస్కరిస్తున్నాను. గురువైన సిద్ధత్థున్ని నమస్కరిస్తున్నాను. మహాముని తిస్సుడిని నమస్కరిస్తున్నాను.

6. మహానాయకుడైన పుస్సుడిని నమస్కరిస్తున్నాను. నాయకుడైన విపస్సిని నమస్కరిస్తున్నాను. మహామునియైన సిఖిని నమస్కరిస్తున్నాను. నాయకుడైన వేస్సభువును నమస్కరిస్తున్నాను.

7. ముని కకుసంధుడిని నమస్కరిస్తున్నాను. నాయకుడైన కోనాగముడిని నమస్కరిస్తున్నాను. సుగతుడైన కస్సపుడిని నమస్కరిస్తున్నాను. నాయకుడైన గౌతముడిని నమస్కరిస్తున్నాను.

8. వీరే మృత్యు రహిత నిర్వాణాన్ని ప్రసాదించే ఇరవైఎనిమిది మంది బుద్ధులు. వీరిని నిత్యమూ శిరస్సువంచి నమస్కరిస్తాను. వీరెల్లప్పుడూ నన్ను రక్షింతురుగాక.



బుద్ధ భగవానుడికి ఆశ్రయమిచ్చిన బోధివృక్షము నిత్యం వందనీయము

# బోధి వందనము

బుద్ధుడు కూర్చుని తపస్సు చేసిన బోధివృక్షము బౌద్ధులందరికీ పూజనీయమైనది. సాధారణంగా దీన్ని 'పిప్పల' వృక్షమంటారు. వృక్షశాస్త్రాన్ని (**Botany**) అనుసరించి దీన్ని "ఫైకస్ రెలిజియోసా" (**Ficus religiosa**) అంటారు. బుద్ధుడికి దీనిక్రింద జ్ఞానోదయం కాక ముందునుండి కూడా భారత దేశంలో దీన్ని ఒక పవిత్రమైన వృక్షంగా భావించేవారు.

బుద్ధుడికి జ్ఞానోదయమైన తరువాత అతడు బోధివృక్షచ్ఛాయనుండి పైకి లేచి దానికి దూరంగా వెళ్లి కృతజ్ఞతా భావంతో దాన్ని ఒక వారం పాటు అలాగే చూస్తూ నిలబడ్డాడు. మరో సందర్భంలో బుద్ధుడు తను లేనప్పుడు తన స్థానంలో బోధివృక్షాన్ని నాటమన్నాడు.

అందుకే మొదటినుండి బౌద్ధులంతా బుద్ధుడి సంబోధికి ప్రతిరూపమైన బోధివృక్షాన్ని పూజిస్తూవచ్చారు. ఇంత విశిష్టమైన ఈ బోధివృక్షమున్న ప్రతీచోటిని, దానికి పూజలు జరిగే ప్రతీ స్థలాన్ని కొన్ని అదృశ్య దైవిక శక్తులు రక్షిస్తూ ఉంటాయని బౌద్ధుల దృఢమైన నమ్మకం. ఇలా ఈ ప్రతీకాత్మకతనర్థం చేసుకోలేని వారంతా బౌద్ధులు కేవలం చెట్లను పూజించేవారనుకుంటారు.

## బోధివందనా

1. యస్స మూలే నిసిన్నో వ
సబ్బారి విజయం అకా
పత్తో సబ్బఞ్ఞు తం సత్థా
వన్దే తం బోధి పాదపం

2. ఇమే ఏతే మహాబోధి
లోక నాథేన పూజితా
అహమ్పి తే నమస్సామి
బోధి రాజా నమత్థు తే.

## బోధివందనము

1. బుద్ధుడు ఏ వృక్షమూలంలో కూర్చుని సర్వజ్ఞతను పొంది, సర్వ శత్రువులను జయించాడో ఆ బోధి వృక్షాన్ని నేను నమస్కరిస్తున్నాను.

2. ఈ సంబోధి మహావృక్షాన్ని లోకానికే ప్రభువైన బుద్ధుడే స్వయంగా పూజించాడు. నేను కూడా ఓ బోధివృక్షమా, నిన్ను నమస్కరిస్తున్నాను. ఓ బోధిరాజా, నీకిదే నా వందనము.



కోరికల నధిగమించి చైత్య వందనమొనర్చువాడే బుద్ధుడికి నిజమైన శిష్యుడు.

# చైత్యవందనము

ప్రపంచవ్యాప్తంగా అనేక బౌద్ధ మందిరాలలో చైత్యములు సర్వమాన్యములై పూజార్హమైనవిగా భావించబడతాయి. సుందరమైన ఈ బౌద్ధనిర్మాణము కేవలం అలంకార ప్రాయమైనదని భావించకూడదు. నిజానికి ఈ చైత్యాలలో బుద్ధుడి, అతడి శిష్యుల అవశేషాలు, ప్రతిమలు, ఇంకా వారికి సంబంధించిన ఎన్నో ముఖ్యవస్తువులు ఉంటాయి. ఇవి శ్రద్ధతో ప్రతిష్ఠించబడినవి. ఈ చైత్యాలు ప్రతీదేశంలో వారి వారి దేశీయ కట్టడాలననుసరించి నిర్మించబడ్డాయి.

బౌద్ధులకు వారి మతం పట్ల శ్రద్ధను పెంపొందించే ఈ పూజ్య ధార్మిక చిహ్నాలు ఎంతో ముఖ్యమైనవని గుర్తించాలి. ఈ ధార్మిక చిహ్నాలు భక్తులకెంతగానో ప్రేరణనందిస్తాయి. ధార్మిక వాతావరణాన్నేర్పరుస్తాయి. ధార్మిక కృత్యాల నాచరించడానికి తగు వాతావరణాన్ని కల్పించి ఆ స్థలాన్ని పవిత్రీకృతం చేస్తాయి. ఈ గాథలను చైత్య, బోధివృక్ష, బుద్ధవిగ్రహాలను పూజించే సమయంలో పఠించాలి.

## చేతియ వందనా

1. వందామి చేతియం సబ్బం
సబ్బ ఠానేసు పతిట్ఠితం,
సారీరిక ధాతు మహాబోధిం
బుద్ధ రూపం సకలం సదా.

## రతన త్తయ వందనా

1. బుద్ధా ధమ్మా చ పచ్చేక బుద్ధా
సంఘా చ సామికా
దాసోహమస్మి మే తేసం
గునం ఠాతు సిరే సదా

2. తిసరణం తిలక్ఖణూపేక్ఖం
నిబ్బానం అన్తిమం సుఖం
సువన్దే సిరసా నిచ్చం
లభామి తివిధం అహం

3. తిసరణం చ సిరే ఠాతు
సిరే ఠాతు తిలక్ఖణం
ఉపేక్ఖా చ సిరే ఠాతు
నిబ్బానం ఠాతు మే సిరే

## చైత్య వందన

1. శారీరక అవశేషాలను, మహోబోధిని, బుద్ధుడి ప్రతిమను కలిగిన చైత్యాలెక్కడున్నా నేను వాటిని నమస్కరిస్తాను.

## రత్నత్రయం వందనము

1. బుద్ధుడు, ధర్మము, ప్రత్యేక బుద్ధులు, సంఘము; ఇవి నా ప్రభువులు. నేను వారికి సేవకుడను. వారి సద్గుణములు సర్వదా నా శిరస్సు యందు ప్రతిష్ఠితములగుగాక.

2. త్రిలక్షణములు, త్రిశరణములు, అంతిమ సుఖమైన నిర్వాణము; వీటిని నేను నిత్యమూ శిరస్సు వంచి నమస్కరిస్తాను.

3. త్రిశరణములు నా శిరస్సు నధివసించుగాక. త్రిలక్షణములు నా శిరస్సునధివసించుగాక. ఉపేక్ష నా శిరస్సునధివసించుగాక. నిర్వాణం నా శిరస్సునధివసించుగాక.

4. కారుణ్యాంతరంగుడైన బుద్ధుడిని, అతడి పవిత్రమైన ధర్మాన్ని, ప్రత్యేక సమ్బుద్ధులను, సంఘాన్ని అనునిత్యము శిరస్సు వంచి నమస్కరిస్తాను.

5. శ్రద్ధతో బుద్ధుడి మౌలికమైన (అంతిమ ఉపదేశం లోని) "అప్రత్తులై లక్ష్యాన్ని సాధించండి" అన్న ఉపదేశాన్ని నమస్కరించి పాటిస్తాను. అన్ని చైత్యాలను, గౌరవనీయులైన నా ఉపాధ్యాయులను, ఆచార్యులను నమస్కరిస్తున్నాను.

6. ఈ ప్రణామములవల్ల జనించిన శక్తితో నా చిత్తము నుండి సమస్త పాపాలు తొలగిపోవుగాక. భిక్షువులారా! ఇలా బుద్ధుడిని, ధర్మమును, సంఘమును శరణువేడుకోవడం వల్ల భయాందోళనలు తొలగిపోతాయి.



బుద్ధపూజలో నిర్మలమైన మనస్సే ఒక సుగంధ పుష్పం వంటిది.

# పూజ

(దీప, పుష్ప, నైవేద్య, ఔషధ పానీయ, సుగంధ ధూపముల సమర్పణ)

దీప, పుష్ప, నైవేద్య, ఫలరస, సుగంధములను సమర్పించే సమయంలో ఈ క్రింది గాథలను చదవాలి. ఈ వస్తువులను బుద్ధభగవానుడికి సమర్పించడం వెనక ఒక ప్రయోజనం ఉంది. కాని చాలామంది ఈ సమర్పణని తప్పుగా అర్థం చేసుకుంటారు. దివ్యపురుషులకు ఈ పదార్థాలు సమర్పించడమనేది చాలా ప్రాచీనమైన ఆచారము. బుద్ధుడి సమయలో కూడా ప్రజలెవరైనా దివ్యపురుషులను సందర్శించడానికి వెళ్ళినట్లైతే పువ్వులను తీసుకొని వెళ్ళేవారు. ఇది కేవలం గౌరవార్థం చేసే పని.

అందుకే బౌద్ధభక్తులు బుద్ధుడు, ధర్మము, సంఘముల పేర్ల మీదుగా ఎంతోకొంత దానం చేస్తూనే ఉంటారు. వీరికి ఈ ప్రతీకాత్మక చర్య ఆనందాన్ని, శాంతిని కలిగిస్తుంది. అంతేకాని భౌతిక వస్తుజాలమే తుదిలక్ష్యమని వారెప్పుడూ భావించరు. అవి కేవలం ఆధ్యాత్మికతకి ప్రతీకమైనవన్న విషయం వారికి తెలియంది కాదు. బుద్ధభగవానుడికి సమర్పించే దీపము మానవ జీవితానికి ప్రతీకమైనది. కాబట్టి దీపాన్ని సమర్పించేటప్పుడు ఆ దీపం అంధకారాన్ని తన కాంతితో పారద్రోలగల శక్తిగలదని మనం అర్థం చేసుకోవాలి. దీపము, దాని ప్రకాశము ఈ రెంటి అస్తిత్వము, పుష్పముల సౌందర్యము, ధూపగంధము, ఇవన్నీ తాత్కాలికములే. ఎందుకంటే దీపము నుండి వచ్చే ఆ ప్రకాశము శాశ్వతమైనది కాదు. ఇదే విధంగా పుష్ప సుగంధము, ధూపముల సువాసన ఇవన్నీ శాశ్వతమైనవి కావు. వాటి అస్థిరత్వము అందరికీ తెలిసినదే. ఇదంతా ప్రకృతి ధర్మం. ఈ ప్రాకృతిక వస్తుజాలాన్ని, ధ్యానం కొరకు వాడడం ఉచితమే. వీటిని వాడటానికి మరో కారణం ఉంది. ఉదాహరణకి పువ్వులను తీసుకొండి; పువ్వులు ప్రకృతి లోని సహజ సౌందర్యానికి ప్రతీకలు.

సంపూర్ణ మానసికానుభూతిని, పరిపూర్ణతను కలిగిస్తాయి కాబట్టి ఈ సమర్పణలు పుణ్యకర్మలకు ప్రతీకమైనవి. ఒక పుణ్యస్థలంలో పైన పేర్కొన్న పూజాద్రవ్యాలను సమర్పిస్తూ చేసిన పూజ, గడిపిన సమయము ఎన్నటికీ వ్యర్థము కాజాలవు. భక్తులు చేసే ఇలాంటి పనులు వారి మనస్సును శాంతపరుస్తాయి.

పైన పేర్కొన్న ద్రవ్యాలను బుద్ధభగవానుడికి సమర్పించి నిత్యకర్మలను ప్రారంభించడం ఎంతో శ్రేయస్కరం. సాక్షాత్తు బుద్ధుడే మనకు ఋజుమార్గాన్ని, శాంతిమార్గాన్ని, ఆనందపథాన్ని, మోక్ష మార్గాన్ని చూపించాడు. బౌద్ధులు బుద్ధుడికి ఏవో కొన్ని ద్రవ్యాలు మొక్కుబడిగా సమర్పించి సంతృప్తి చెందకూడదు. అదేవిధంగా ఏవో కొన్ని గాథలను చిలుకల్లా వల్లెవేస్తూ అంతటితో వారి పని అయిపోయిందని భావించరాదు. నిజమైన బౌద్ధులుగా మారాలంటే ఈ మాత్రమే చాలదు. ఇంకా చాలా పనులు చేయాలి. బుద్ధుడి ఉపదేశాన్ని అనుసరిస్తూ తమను తాము సరిదిద్దుకోవాలి. అతడి బోధనల ద్వారా మరింత జ్ఞానాన్ని సంపాదించడానికి ప్రయత్నం చేయాలి. పైన పేర్కొన్న ద్రవ్యాలలో ఏవో కొన్నింటిని మొక్కుబడిగా సమర్పించినంత మాత్రాన తమ తప్పిదాలన్నీ సమసిపోతాయని మాత్రం ఊహించకూడదు.

## దీపసమర్పణం

1. ఘనసారప్ప దిత్తేన
దీపేన తమ ధన్సినా
తిలోక దీపం సమ్బుద్ధం
పూజయామి తమో నుదం

## పుష్ప సమర్పణం

1. వన్న గంధ గుణోపేతం
ఏతం కుసుమసంతతిం,
పూజయామి మునిన్దస్స
సిరీ పాద సరోరుహే.

2. పూజేమి బుద్ధం కుసుమేననేన
పుణ్ణేన మేతేన చ హోతు మోక్ఖం,
పుప్ఫం మిలాయాతి యథా ఇదం మే,
కాయో తథా యాతి వినాసభావం.

## నైవేద్య సమర్పణం

1. అధివాసేతు నో భన్తే
భోజనం పరికప్పితం
అనుకమ్పం ఉపాదాయ
పటిగన్హాతు ముత్తమం

## దీప సమర్పణము

1. ముల్లోకాలను తన జ్ఞానమనే కిరణంతో వెలిగించి అజ్ఞానమనే చీకటిని పారద్రోలిన ఆ సమ్యక్ సమ్బుద్ధుడిని తమస్సును ధ్వంసం చేసి ప్రకాశవంతంగా వెలుగుతున్న దీపంతో పూజిస్తున్నాను.

## పుష్ప సమర్పణము

1. అందమైన రంగు, సువాసన కలిగిన ఈ పువ్వులతో మునిశ్రేష్ఠుడైన బుద్ధుడి పవిత్ర పాదాలను పూజిస్తున్నాను.

2. పువ్వులతో నేను బుద్ధుడిని పూజిస్తున్నాను. ఈ పుణ్యకర్మతో నాకు మోక్షం ప్రాప్తించుగాక. పువ్వులన్నీ ఒకనాడు వాడిపోయేవే. అదేవిధంగా నా ఈ శరీరం కూడా ఒకనాడు నశించేదే.

## నైవేద్య సమర్పణము

1. భన్తే! నీ కొరకు నేను భోజనం సమర్పించాను. నాపై దయచూపి దీన్ని స్వీకరించు.

## ఔషధపానీయ సమర్పణం

1. అధివాసేతు నో భన్తే
గిలాన పచ్చయం ఇమం
అనుకమ్పం ఉపాదాయ
పటిగణ్హాతు ముత్తమం

## సుగంధ ధూప సమర్పణం

1. గన్ధ సమ్భార యుత్తేన
ధూపే నాహం సుగన్ధినా
పూజయే పూజనీయం తం,
పూజా భాజన ముత్తమం.

## పటిపత్తి పూజా

1. ఇమాయ ధమ్మాను ధమ్మా
పటిపత్తియా బుద్ధం పూజేమి

2. ఇమాయ ధమ్మాను ధమ్మా
పటిపత్తియా ధమ్మం పూజేమి

3. ఇమాయ ధమ్మాను ధమ్మా
పటిపత్తియా సంఘం పూజేమి

4. అద్ధా ఇమాయ పటిపత్తియా
జాతి జరా వ్యాధి మరణమ్హా పరే ముచ్చిస్సామి

## ఔషధపానీయాల సమర్పణము

1. భన్తే! ఈ ఔషధ పానీయాలను నీకు సమర్పిస్తున్నాను. నాపై దయ చూపి వీటిని స్వీకరించు.

## సుగంధ ధూప సమర్పణము

1. సుగంధ ద్రవ్యాలతో తయారు చేసిన ఈ సువాసనల ధూపంతో (ఊదిబత్తితో) పూజనీయుడైన, సర్వపూజలకూ నిలయమైన ఆ మహనీయుడిని (బుద్ధుడిని) పూజిస్తున్నాను.

## ప్రతిపత్తి పూజ

1. ఈ నా సత్స్వభావంతో, సత్ ప్రవర్తనతో బుద్ధుడిని పూజిస్తున్నాను.
2. ఈ నా సత్స్వభావంతో, సత్ ప్రవర్తనతో ధర్మమును పూజిస్తున్నాను.
3. ఈ నా సత్స్వభావంతో, సత్ ప్రవర్తనతో సంఘమును పూజిస్తున్నాను.
4. ఈ ప్రతిపత్తితో జాతి, జరా, వ్యాధి మరణముల నుండి ముక్తిని పొందెదను గాక.



మనోవాక్కాయములతో బుద్ధుడిని శరణుపొందిన వారికి అతడే రక్షకుడు.



హింసామార్గాన్ని వీడి బుద్ధుడిని వేడుకొంటే అతడే శాంతిని ప్రసాదిస్తాడు.

# ఆవాహనము

ఒకనాడు దేవతలకు రాజైన ఇంద్రుడు బుద్ధుడిని సమీపించి అతడు ధర్మోపదేశం చేసే సమయాలలో దేవతలను కూడా పిలవమని ప్రార్థిస్తాడు. బుద్ధుడి ఉపదేశాల వల్ల సంతసించిన దేవతలు కృతజ్ఞతా భావంతో బుద్ధుడి భక్తులను రక్షించేవారు. ఆనాటి నుండి బౌద్ధులు గాథలను పఠించేముందు దేవతలనాహ్వానించి, భక్తులను రక్షించడమనే వారి పూర్వబాధ్యతను వారికి జ్ఞాపకం చేయడం ప్రారంభమైంది.

## ఆవాహనా (1)

1. యే సన్తా సన్తచిత్తా
తిసరణ సరనా
ఏత్థ లోకన్తరే వా
భుమ్మా భుమ్మా చ దేవా
గుణ గణ గహన
బ్యావతా సబ్బకాలం
ఏతే ఆయన్తు దేవా
వరకనక మయే
మేరు రాజే వసన్తో
సన్తో సన్తో సహేతుం
మునివర వచనం
సోతు మగ్గం సమగ్గం.

2. సబ్బేసు చక్క వాలేసు
యక్ఖా దేవా చ బ్రహ్మనో
యం అమ్హేహి కతం పుఞ్ఞం
సబ్బ సమ్పత్తి సాధకం
సబ్బే తం అనుమోదిత్వా
సమగ్గా సాసనే రతా
పమాద రహితా హోన్తు
ఆరక్ఖాసు విసేసతో.

## దేవతలకు ఆహ్వానము (1)

1. ఈ లోకంలో లేక మరోలోకంలో ఉన్న శాంతచిత్తులు, త్రిశరణాలను శరణుజొచ్చిన వారు, సకల సద్గుణములను సర్వకాలములందు కలిగియుండిన ప్రాణులు, దేవతలు అంతా మేరు పర్వతంపై నివసిస్తూ శాంతుడైన ఆ మునివరుని ఉదాత్త వచనములను వినుటకు వత్తురుగాక.

2. సమస్త లోకాలలో ఉండే దేవతలు, బ్రాహ్మణులు మేము చేసిన సర్వ సంపత్కారణ భూతమైన పుణ్యకర్మల నామోదించి, బుద్ధ శాసనమునందు మక్కువ గలవారై సమత్వ బుద్ధితో ప్రమాద రహితులగుదురుగాక.

3. సాసనస్స చ లోకస్స
వుద్ధి భవతు సబ్బదా
సాసనమ్పి చ లోకం చ
దేవా రక్ఖంతు సబ్బదా
సద్ధిం హోన్తు సుఖి సబ్బే
పరివారేహి అత్తనో
అనీఘ సుమనా హోన్తు
సహ సబ్బేహి ఞాతిభి.

4. రాజతో వా చోరతో వా
మనుస్సతో వా అమనుస్సతో వా
అగ్గితో వా ఉదకతో వా
పిసాచతో వా కానుకతో వా
కన్ధకతో వా నక్ఖత్తతో వా
జనపదరోగతో వా అసద్ధమ్మతో వా
అసన్దిట్ఠితో వా అసప్పురిసతో వా
చన్డ హత్థి అస్స మిగ గోన కుక్కుర
అహివిచ్ఛిక మని సప్పదీపి
అచ్ఛ తరచ్ఛ సూకర
మహిస యక్ఖ రక్ఖసాది హి
నానా భయతో వా
నానా రోగతో వా
నానా ఉపద్దవతో వా
ఆరక్ఖం గణ్హన్తు
యే కేచి బుద్ధం సరణం గతాసే
న తే గమిస్సన్తి అపాయం
పహాయ మానుస్సం దేహం
దేవకాయం పరిపూరేస్సన్తీతి

3. బుద్ధ శాసనమునకు, లోకమునకు ఎల్లప్పుడూ అభివృద్ధి కలుగుగాక. దేవతలెల్లప్పుడు శాసనాన్ని, లోకాన్ని రక్షింతురుగాక. అందరూ కలసి మెలసి సుఖసంపదలతో సంతృప్తిగా జీవింతురుగాక.

4. వారంతా రాజువల్ల గాని, దొంగవల్ల గాని మనుష్యులవల్ల గాని రాక్షసులవల్ల గాని, అగ్నివల్ల గాని నీటివల్ల గాని, పిశాచాలవల్ల గాని, గ్రహప్రభావములవల్ల గాని, అంటువ్యాధులవల్ల గాని నక్షత్రములవల్ల గాని, దీర్ఘరోగములవల్ల గాని, అసద్ధర్మమువల్ల గాని, మిథ్యాదృష్టివల్ల గాని క్రూరజంతువులైన ఏనుగు, గుర్రము, కుక్కలు మొదలైన వాటివల్ల గాని దయ్యాలవల్ల గాని, మణులవల్ల గాని, సర్పమువల్ల గాని కస్తూరి మృగమువల్ల గాని, సూకరమువల్ల గాని మహిష, యక్షరాక్షసాదులవల్ల గాని భయం లేకుండా నానారోగములవల్ల, పలు ఉపద్రవాలవల్ల, భయమును వీడి సుఖంగా ఉందురుగాక.

బుద్ధుడిని శరణుపొంది వారు అపాయకర స్థితినెన్నడూ పొందరు. ఈ భౌతికదేహమును వదలిన తరవాత వారు దేవలోకాలకు చేరుకుంటారు.

## వందనా

1. నమో తస్స భగవతో అరహతో సమ్మా సమ్బుద్ధస్స
నమో తస్స భగవతో అరహతో సమ్మా సమ్బుద్ధస్స
నమో తస్స భగవతో అరహతో సమ్మా సమ్బుద్ధస్స

## ఆవాహనం (2)

1. విపత్తి పటివాహాయ
సబ్బసమ్పత్తి సిద్ధియా
సబ్బదుక్ఖం వినాసాయ
సబ్బభయం వినాసాయ
సబ్బరోగం వినాసాయ
భవే దీఘాయుక దాయకం
సబ్బలోకం హితత్థాయ
పరిత్తం తం భణామహే.

2. సమన్తా చక్కవాలేసు
అత్రాగచ్ఛన్తు దేవతా
సద్ధమ్మం మునిరాజస్స
సునన్తు సగ్గ మోక్ఖదం.

3. ధమ్మస్సవనకాలో అయం భదన్తా
ధమ్మస్సవనకాలో అయం భదన్తా
ధమ్మస్సవనకాలో అయం భదన్తా

## వందనము

1. అర్హతుడు సమ్యక్ సమ్బుద్ధుడు అయిన బుద్ధ భగవానుడికి వందనము.
అర్హతుడు సమ్యక్ సమ్బుద్ధుడు అయిన బుద్ధ భగవానుడికి వందనము.
అర్హతుడు సమ్యక్ సమ్బుద్ధుడు అయిన బుద్ధ భగవానుడికి వందనము.

## ఆవాహనము (2)

1. ఆపదలు తొలగి సర్వసమ్పత్తులు సిద్ధించుట కొరకు, సమస్త దుఃఖాలు, భయాలు, రోగాలు తొలగి పోవుటకొరకు దీర్ఘాయువు సిద్ధించుటకొరకు, లోకంలోని సమస్త జనుల క్షేమం కొరకు మేము పరిత్రాణ సుత్తాన్ని పఠిస్తున్నాము.

2. విశ్వంలోని సమస్త దిక్కుల నుండి సర్వదేవతలూ ఇక్కడికి చేరుకొని స్వర్గసుఖము వంటి నిర్వాణ సుఖమును ప్రసాదించు ఈ మునీంద్రుని సద్ధర్మాన్ని విందురుగాక.

3. ఓ పూజ్య భిక్షువులారా, ఇది ధర్మశ్రవణమునకు సముచితమైన సమయము.

ఓ పూజ్య భిక్షువులారా, ఇది ధర్మశ్రవణమునకు సముచితమైన సమయము.

ఓ పూజ్య భిక్షువులారా, ఇది ధర్మశ్రవణమునకు సముచితమైన సమయము.



సర్వ సంస్కారములు అనిత్యములు అని తెలుసుకున్న మానవుడికే నిజమైన మంగళం సిద్ధిస్తుంది.

# మంగళ సుత్తము

(శుభ సందర్భాలలో పఠించ దగినది)

ఉత్తమమైన మంగళమును వివరిస్తూ బుద్ధుడీ క్రింది సుత్తాలను పఠించాడు. ఈ సుత్తమెంత గొప్పదో, దీన్ని చదివితే తెలుస్తుంది. దేవతలు మంగళమంటే ఏమిటని అడిగినప్పుడు బుద్ధుడు వారికి నిజమైన మంగళాన్ని వివరిస్తాడు. బౌద్ధంలో ఆశీర్వాదమంటే కేవలం మహాత్ములు సామాన్యులను దీవించడం కాదు. ధార్మికంగా, ఉన్నతంగా జీవిస్తూ మనిషి తన మనస్సులో భావించే మంగళమయ భావనే ఇక్కడ ఆశీర్వాదము.

శుభ సందర్భాలలో ఈ సుత్తాన్ని పఠించడం ఆచారం. కేవలం పఠించడమే కాదు, భక్తులు దీన్ని అర్థం చేసుకొని పాటించాలి కూడా. ఈ సుత్తంలోని విషయాలను పాటిస్తే మనిషి నిజమైన మంగళాన్ని, ఆశీస్సులను పొందుతాడు. ఇందులో బుద్ధుడు మనకుపదేశించిన నైతిక, ఆధ్యాత్మిక ఉపదేశాలున్నాయి. బుద్ధుని బోధనలు తాత్త్వికమైనవి, ధార్మికమైనవి, ఆధ్యాత్మికమైనవి కూడా. అంతేకాదు అవి సామాజిక బాధ్యతను, క్రమశిక్షణను గూడా బోధిస్తాయని ఈ సుత్తం ద్వారా తెలుస్తున్నది. ఈ సుత్తం లోని గాథలు మూల బుద్ధోపదేశాలు కాబట్టి బౌద్ధులకివంటే చాలా గౌరవము, విశ్వాసం కూడా.

## మంగళ సుత్తం

ఏవం మే సుతం
ఏకం సమయం భగవా
సావత్థియం విహరతి జేతవనే,
అనాథ పిన్డికస్స ఆరామే
అథ ఖో అఞ్ఞతరా దేవతా అభిక్కన్తాయ
రత్తియా అభిక్కన్త వన్నా
కేవలకప్పం జేతవనం ఓభాసేత్వా
యేన భగవా తేనుపసంకమి
ఉపసంకమిత్వా భగవన్తం
అభివాదేత్వా ఏకమన్తం అట్ఠాసి
ఏకమన్తం ఠితా ఖో సా దేవతా
భగవన్తం గాథాయ అజ్ఝభాసి

1. బహూ దేవా మనుస్సా చ
మంగళాని అచిన్తయుం
ఆకంఖమానా సొత్థానం
బ్రూహి మంగళ ముత్తమం

2. అసేవనా చ బాలానం
పండితానం చ సేవనా
పూజా చ పూజనీయానం
ఏతం మంగళ ముత్తమం

# మంగళ సుత్తము

నేనిలా విన్నాను. ఒకానొక సమయంలో బుద్ధభగవానుడు శ్రావస్తి లోని అనాథపిండకుని ఆరామమైన జేతవనంలో విహరిస్తున్నాడు. అప్పుడు మధ్యరాత్రి సమయంలో ఒక దేవత సమస్త జేతవనాన్ని తన కాంతితో ప్రకాశింపజేస్తూ బుద్ధుడున్న చోటికి చేరుకొని అతడిని నమస్కరించి ఒక ప్రక్కన నిలుచున్నది. అలా నిల్చొని ఆ దేవత బుద్ధుడితో గాథా రూపంలో ఇలా మాట్లాడింది.

1. చాలామంది దేవతలు, మనుష్యులు మంగళమంటే ఏమిటో తెలుసుకోవాలని కుతూహలపడుతుంటారు. కావున ఉత్తమమైన మంగళమేదో తెలియజేయుము.

**బుద్ధుడిలా అన్నాడు**

2. మూర్ఖులను సేవించకుండుట, పండితులను సేవించుట, పూజించదగిన వారిని పూజించుట, ఇదే ఉత్తమమైన మంగళము.

3. పతిరూప – దేస వాసో చ
పుబ్బే చ కత పుఞ్ఞతా
అత్తసమ్మా పనిధి చ
ఏతం మంగళ ముత్తమం.

4. బాహు సచ్చఞ్చ సిప్పఞ్చ
వినయో చ సుసిక్ఖితో
సుభాసితా చ యా వాచా
ఏతం మంగళ ముత్తమం.

5. మాతా పితూ ఉపట్ఠానం
పుత్తదారస్స సఙ్గహో
అనాకులా చ కమ్మన్తా
ఏతం మంగళ ముత్తమం

6. దానం చ ధమ్మ చరియా చ
ఞాతకానఞ్చ సఙ్గహో
అనవజ్జాని కమ్మాని
ఏతం మంగళ ముత్తమం.

7. ఆరతి విరతి పాపా
మజ్జపానా చ సఞ్ఞమో
అప్పమాదో చ ధమ్మేసు
ఏతం మంగళ ముత్తమం

3. అనువైన స్థలంలో ఉండుట, పూర్వజన్మలో పుణ్యకర్మల నాచరించుట, యోగ్యమైన ఆలోచనలు కలిగి ఉండుట; ఇదే ఉత్తమమైన మంగళము

4. విశాలమైన విజ్ఞానము, సంపూర్ణమైన శిల్పము (వినమ్రత) సుశిక్షితమైన వినయం గుణం, మంచిమాటలు; ఇదే ఉత్తమమైన మంగళము.

5. తల్లిదండ్రులకు వారి వృద్ధాప్యంలో ఆసరాగా నిలబడడం, భార్యాబిడ్డలను సంతోషపెట్టడం, శాంతియుతమైన వృత్తులను కలిగి ఉండడం, ఇదే ఉత్తమమైన మంగళము.

6. దానము, ధార్మికాచరణ, బంధుమిత్రులకు సహాయపడడం, అనింద్యమైన కర్మల నాచరించడం; ఇదే ఉత్తమైన మంగళము.

7. పాపములను చేయుడమూపి వాటిపై విరక్తి జనించడం, మద్యపానాన్ని వదలిపెట్టడం, ధర్మాచరణలో అప్రమత్తులై వ్యవహరించడం; ఇదే ఉత్తమమైన మంగళము.

8. గారవో చ నివాతో చ
సన్తుట్ఠి చ కతఞ్ఞుతా
కాలేన ధమ్మ సవనం
ఏతం మంగళ ముత్తమం.

9. ఖన్తి చ సోవచస్సతా
సమానానఞ్చ దస్సనం
కాలేన ధమ్మ సాకచ్ఛా
ఏతం మంగళ ముత్తమం.

10. తపో చ బ్రహ్మ చరియా చ
అరియసచ్చాన దస్సనం
నిబ్బాన సచ్ఛికిరియా చ
ఏతం మంగళ ముత్తమం.

11. ఫుట్ఠస్స లోకధమ్మేహి
చిత్తం యస్స న కమ్పతి,
అసోకం విరియం ఖేమం,
ఏతం మంగళ ముత్తం.

12. ఏతాదిసాని కత్వాన
సబ్బత్థ మపరాజితా
సబ్బత్థ సోత్థిం గచ్ఛన్తి
తం తేసం మంగళ ముత్తమం'తి.

8. గౌరవము, వినయము, సంతృప్తి, కృతజ్ఞత, సకాలంలో ధర్మాన్ని వినడం; ఇదే ఉత్తమమైన మంగళము.

9. సహనము, నమ్రత, శ్రమణుల దర్శనము, సరైన సమయంలో ధార్మిక చర్చ; ఇదే ఉత్తమమైన మంగళము.

10. ఆత్మసంయమనము, పవిత్రమైన జీవనము, ఆర్యసత్యాలను అర్థం చేసుకోవడం, నిర్వాణాన్ని సాక్షాత్కరింపజేసుకోవడం (పొందడం); ఇదే ఉత్తమమైన మంగళము.

11. లోకధర్మాల వల్ల మనస్సు చలించకుండుట, శోకము లేకుండుట, బలము కలిగి ఉండుట, క్షేమము కలిగి ఉండుట; ఇదే ఉత్తమమైన మంగళము.

12. ఇలాంటి సత్కర్మలనాచరించి ఎక్కడ కూడా పరాజయమన్నది లేనివారై, సర్వత్ర సంతోషంగా విహరించాలి; ఇదే ఉత్తమమైన మంగళము.



సూర్య చంద్రులకంటే స్వచ్ఛమైన కాంతి గల బుద్ధుడే లోకంలో శ్రేష్ఠ రత్నము.

# రత్న సుత్తము

(ప్రతికూలమైన దుష్టశక్తుల పరిహారం కొరకు పఠించదగినది)

బుద్ధుడు వ్యాధిగ్రస్తమైన వైశాలీ నగరాన్ని ప్రవేశించి ఆ నగరంలోని ప్రజలను అతివృష్టి, అనావృష్టి, వ్యాధులు, దుష్టశక్తులు వంటి వాటి బారినుండి రక్షించడానికి ప్రభావవంతమైన ఈ రత్న సుత్తాన్ని పఠించాడు. ఈ సుత్తాన్ని పఠించడం వల్ల బుద్ధుని కాలంలో చాలామంది తమ బాధలను దూరం చేసుకొని ఎంతో లాభపడ్డారు. ఈ సుత్తం త్రిరత్నాలను వివిధకోణాలలో వివరిస్తూ బుద్ధుడు, ధర్మము, సంఘముల ఔన్నత్యాన్ని వర్ణిస్తుంది. ప్రతీ గాథ చివరన బుద్ధుడు "ఈ సత్యం వల్ల అన్ని ప్రాణులూ సంతోషంగా ఉండుగాక" అని దీవిస్తాడు. దీన్ని విన్నవారందరినీ రక్షించమని, దీన్నిస్మరించే వారిని ఉద్ధరించి వారి కష్టాలను కడతేర్చమని ఇంద్రుడు దేవతలను అడుగుతాడు.

ఈ సుత్తం విన్న తరువాత ఇంద్రుడుసైతం ఆనందపడ్డాడు. చివరి మూడు గాథలను చదివి తన శ్రద్ధాభక్తులను ప్రకటించుకున్నాడు. భక్తులంతా ఈ సుత్తాన్ని చదవాలి. ఆధి, వ్యాధుల చేత బాధపడుతున్నప్పుడు ప్రతీరోజూ దీన్ని పఠించాలి. ఆయా సమయాలలో ఈ సుత్తాన్ని చదివించడానికి గృహస్థులు భిక్షువులను వారి ఇండ్లకు ఆహ్వానించాలి.

## రతన సుత్తం

1. యానీధ భూతాని సమాగతాని
భుమ్మాని వా యాని వ అన్తలిక్ఖే
సబ్బేవ భూతా సుమనా భవన్తు
అథోపి సక్కస్స సునన్తు భాసితం.

2. తస్మా హి భూతా నిసామేథ సబ్బే
మేత్తం కరోథ మానుసియా పజాయ
దివా చ రత్తో చ హరన్తి యే బలిం
తస్మా హి నే రక్ఖథ అప్పమత్తా.

3. యంకించి విత్తం ఇధ వా హూరం వా
సగ్గేసు వాయం రతనం పనీతం
ననో సమం అత్థి తథాగతేన
ఇదమ్పి బుద్ధే రతనం పనీతం
ఏతేన సచ్చేన సువత్థి హోతు

4. ఖయం విరాగం అమతం పనీతం
యదజ్ఝగా సక్యముని సమాహితో
న తేన ధమ్మేన సమత్థి కిన్చి,
ఇదమ్పి ధమ్మే రతనం పనీతం
ఏతేన సచ్చేన సువత్థి హోతు

# రత్నసుత్తము

1. ఇక్కడ సమావేశమైన ప్రాణులే కాక భూమిపై జీవించేవి, అంతరిక్షము నందలివి అన్నీ సంతోషంగా ఉండుగాక. సర్వప్రాణులూ ఈ ఇంద్రుని మాటలు విందురుగాక.

2. ఓ ప్రాణులారా! అందుకే మీరంతా వినండి. రాత్రింబగళ్ళు మీకొరకు పాటుపడి మీకు ఇంత అన్నంపెట్టే మనుష్యులనెల్లప్పుడూ మీరు ప్రేమించండి. వారిని ఎల్లప్పుడూ జాగ్రత్తగా కాపాడండి.

3. ఈ లోకంలో గాని పరలోకంలో గాని ఎంతటి ధనమైనా, ఆ స్వర్గలోకం లోని రత్నమైనా వీటిలో ఏది కూడా ఆ తథాగతుడితో సమానం కాదు. బుద్ధుడిలో ఇది ఒక రత్నము. ఈ సత్యప్రభావంతో మాకు మంగళము కలుగు గాక.

4. ఆ శాక్యముని సమాహితుడై సంసార క్షయమును, తద్వారా వైరాగ్యమును, తద్వారా శ్రేష్ఠమైన అమృత పదమును పొందవలెనన్న సంగతిని బాగా జీర్ణించుకున్నాడు. నిజానికి ధర్మముతో సమానమైన దేదీలేదు. ఆ ధర్మము లో కూడా ఇది అత్యంత అమూల్యమైన రత్నము. ఈ సత్యప్రభావంతో మాకు మంగళము కలుగుగాక.

5. యం బ్బుద్ధసేట్ఠో పరివన్నయి సుచిం,
సమాధి-మానన్తరి - కఞ్ఞ - మాహు
సమాధినా తేన సమో న విజ్జతి
ఇదమ్పి ధమ్మే రతనం పనీతం
ఏతేన సచ్చేన సువత్థి హోతు.

6. యే పుగ్గలా అట్ఠసతం పసత్థా
చత్తారి ఏతాని యుగాని హోన్తి
తే దక్ఖినేయ్యా సుగతస్స సావకా
ఏతేసు దిన్నాని మహప్ఫలాని
ఇదమ్పి సంఘే రతనం పనీతం
ఏతేన సచ్చేన సువత్థి హోతు

7. యే సుప్పయుత్తా మనసా దళ్హేన
నిక్కామినో గోతమ సాసనమ్పి
తే పత్తి పత్తా అమతం విగయ్హ
లద్ధా ముధా నిబ్బుతిం భుంజమానా
ఇదప్పి సంఘే రతనం పనీతం
ఏతేన సచ్చేన సువత్థి హోతు.

8. యథిన్దఖీలో పఠవిం సితో సియా
చతుబ్భి వాతేభి అసమ్పు కమ్పియో
తథూపమం సప్పురిసం వదామి
యో అరియ సచ్చాని అవేచ్చ పస్సతి,
ఇదమ్పి సంఘే రతనం పనీతం
ఏతేన సచ్చేన సువత్థి హోతు.

5. శ్రేష్ఠుడైన బుద్ధుడు చూపిన మార్గాన్ని గొప్పవారు - "విఘ్నరహితమైన ఏకాగ్రతను (సమాధి) ప్రసాదించెద"ని వర్ణిస్తారు. ఆ ఏకాగ్రత (సమాధి) వంటిది మరేదీ ప్రపంచంలో లేదు. ఈ సత్యప్రభావంతో మాకు మంగళము కలుగుగాక.

6. ఆ ఎనిమిది మంది వ్యక్తులు వారి సద్గుణాల వల్ల లోకంలో సర్వదా కీర్తించబడ్డారు. వారిని నాలుగు భాగాలలో విభజించవచ్చు. సుగతుని శిష్యులైన ఆ ఎనిమిది మంది నిజంగా పూజార్హులు. వారికి కానుకలిస్తే మహాఫలాలు లభిస్తాయి. బౌద్ధ సంఘంలో వీరు కూడా ఒక అమూల్యరత్నం వంటివారే. ఈ సత్య ప్రభావంతో మాకు మంగళము కలుగుగాక.

7. సరైన, దృఢమైన మనస్సుతో నిష్కాములై గౌతమబుద్ధుని శాసనంలో ఆరితేరినవారై వారంతా పొందవలసిన ఫలితాన్ని ఎప్పుడో పొందారు. అమృతత్వంలో మునిగి సంపూర్ణ స్వతంత్రులై నిర్వాణ సుఖాన్ని అనుభవించారు. బౌద్ధ సంఘంలో ఈ అమూల్య రత్నం కూడా ఉన్నది. ఈ సత్య ప్రభావంతో మాకు మంగళము కలుగుగాక.

8. స్తంభాన్ని భూమిలో దృఢంగా నాటితే నాలుగు దిక్కుల నుండి గాలివీచినా అది ఏ మాత్రం కమ్పించదు. అదే విధంగా నాలుగు ఆర్యసత్యాలను అర్థం చేసుకొని ఆచరించేవాడు జీవితంలో స్థిరంగా ఉండగలడని నేను చెపుతాను. బౌద్ధ సంఘంలో ఈ అమూల్య రత్నం కూడా ఉన్నది. ఈ సత్య ప్రభావంతో మాకు మంగళము కలుగుగాక.

9. యే అరియ సచ్చాని విభావయన్తి
గమ్భీర పఞ్ఞేన సుదేసితాని
కించాపి తే హోన్తి భుసప్పమత్తా
న తే భవం అట్ఠమం ఆదియన్తి
ఇదమ్పి సంఘే రతనం పనీతం,
ఏతేన సచ్చేన సువత్థి హోతు

10. సహావస్స దస్సన సమ్పదాయ
తయస్సు ధమ్మా జహితా భవన్తి
సక్కాయ దిట్ఠి విచికిచ్ఛితం చ
సీలబ్బతం వా పి యదత్థి కించి
చతూ హపాయేహి చ విప్పముత్తో
ఛ చాభిఠానాని అభబ్బోకాతుం
ఇదమ్పి సంఘే రతనం పనీతం
ఏతేన సచ్చేన సువత్థి హోతు.

11. కిఞ్చాపి సో కమ్మం కరోతి పాపకం
కాయేన వాచా ఉద చేతసా వా
అభబ్బో సో తస్స పటిచ్ఛాదాయ
అభబ్బతా దిట్ఠ పదస్స వుత్తా
ఇదమ్పి సంఘే రతనం పనీతం
ఏతేన సచ్చేన సువత్థి హోతు

9. సంపూర్ణజ్ఞానియైన ఆ మహాత్ముడు ప్రవచించిన ఆర్యసత్యాలను స్పష్టంగా అర్థం చేసుకున్నవారు, (జన్మలెంత అత్యావశ్యకములైనా, దుర్నివారములైనా) మళ్ళీ ఎనిమిదవ జన్మనెత్తరు. (ఇలాంటి ముక్తపురుషులు కేవలం ఏడు జన్మలనే ఎత్తుతారు) బౌద్ధ సంఘంలో ఈ అమూల్య రత్నం కూడా ఉన్నది. ఈ సత్య ప్రభావంతో మాకు మంగళము కలుగుగాక.

10. అంతర్దృష్టి ప్రాప్తించగానే దానితో బాటే అతడు మూడు గుణాలను వదిలిపెట్టాడు. అవి; ఆత్మ విషయక విశ్వాసము, సంశయము, వివిధ శీలవ్రతాదుల పై ఆధారపడడం. ఇంతేకాదు, నాలుగు రకాలైన దుఃఖ స్థానముల నుండి కూడా అతడు విముక్తుడైనాడు. ఆరువిధాలైన పరమనేరాలను* త్యజించమన్నాడు. సంఘంలో ఈ అమూల్య రత్నం కూడా ఉన్నది. ఈ సత్య ప్రభావంతో మాకు మంగళము కలుగుగాక.

11. శరీరంతో, మాటలతో, మనస్సుతో తను చేసిన పాపాన్ని దాచిఉంచడం అతడికి చేతకాదు. సత్యమార్గాన్ని దర్శించిన వారికి తమ తప్పులను దాచడం అసంభవమని ప్రాజ్ఞులంటారు. బౌద్ధ సంఘంలో ఈ అమూల్య రత్నం కూడా ఉన్నది. దీని ప్రభావంతో మాకు మంగళము కలుగుగాక.

---

* ఆరువిధాలైన పరమనేరాలు :

1. తన తల్లిని వధించడం
2. తన తండ్రిని వధించడం
3. అర్హతుడిని వధించడం
4. బుద్ధుడిని గాయపరచడం
5. సంఘంలో విభేదం సృష్టించడం
6. మిథ్యా దృష్టులను పాటించడం

12. వనప్పగుమ్బే యథా ఫుస్సితగ్గే
గిమ్హాన మాసే పఠమస్మింన్ గిమ్హే
తథూపమం ధమ్మ వరం అదేసయి
నిబ్బాన గామిం పరమం హితాయ
ఇదమ్పి బుద్ధే రతనం పనీతం
ఏతేన సచ్చేన సువత్థి హోతు.

13. వరో వరఞ్ఞూ వరదో వరాహరో
అనుత్తరో ధమ్మవరం అదేసయి.
ఇదమ్పి బుద్ధే రతనం పనీతం
ఏతేన సచ్చేన సువత్థి హోతు.

14. ఖీనం పురానం
నవం నత్థి సమ్భవం
విరత్త చిత్తా ఆయతికే భవస్మిన్
తే ఖీన - బీజా అవిరుళ్హి ఛన్దా
నిబ్బన్తి ధీరా యథాయం పదీపో
ఇదమ్పి సంఘే రతనం పనీతం
ఏతేన సచ్చేన సువత్థి హోతు.

12. గ్రీష్మంలోని మొదటి నెలలో పుష్పించిన అరణ్యంలా సర్వధర్మాలలో శ్రేష్ఠమైన నిర్వాణగామి మార్గము లోకుల హితము కొరకే ఉపదేశించబడినది. బుద్ధుడిలో ఈ అమూల్య రత్నమును కనుగొనవచ్చును. ఈ సత్య ప్రభావంతో మాకు మంగళము కలుగుగాక.

13. శ్రేష్ఠుడు, శ్రేష్ఠ విషయాలనెరిగిన వాడు, శ్రేష్ఠజ్ఞానమును ఇచ్చువాడు, శ్రేష్ఠములను తెచ్చువాడు అయిన అతడు ఉత్తమ శ్రేష్ఠ ధర్మమును ఉపదేశించెను. ఈ రత్నము కూడా బుద్ధునియందున్నది ఈ సత్య ప్రభావంతో మాకు మంగళము కలుగుగాక.

14. వారి గతమంతా నశించినది. కొత్తగా వచ్చే జన్మలేదు. వారి బుద్ధులు నిర్లిప్తమైనవి. మరో జన్మపై వారికి కోరిక లేదు. ఆ బుద్ధిమంతులు దీపంలా నిర్వృతిని పొందుతారు. సంఘంలో ఈ అమూల్యమైన రత్నం కూడా ఉన్నది. ఈ సత్యప్రభావంతో మాకు మంగళము కలుగుగాక.

15. యానీధ భూతాని సమాగతాని
భుమ్మాని వా యాని వ అన్తలిక్ఖే
తథాగతం దేవమనుస్స పూజితం
బుద్ధం నమస్సామ సువత్థి హోతు.

16. యానీధ భూతాని సమాగతాని
భుమ్మాని వా యాని వ అన్తలిక్ఖే
తథాగతం దేవమనుస్స పూజితం,
ధమ్మం నమస్సామ సువత్థి హోతు.

17. యానీధ భూతాని సమాగతాని
భుమ్మాని వా యాని వ అన్తలిక్ఖే
తథాగతం దేవమనుస్స పూజితం,
సంఘం నమస్సామ సువత్థి హోతు.

18. ఏతేన సచ్చ వజ్జేన
దుక్ఖా వూప సమన్తు మే
ఏతేన సచ్చ వజ్జేన
భయా వూపసమన్తు మే
ఏతేన సచ్చవజ్జేన
రోగా వూపసమన్తు మే.

15. భూమిమీద, ఆకాశంలో నివసించే ప్రాణులంతా ఇక్కడ ఏకత్రితులమై దేవతలు, మానవులు పూజించే తథాగతుని నమస్కరిద్దాము. దీనివల్ల మనకందరికీ మంగళము కలుగుగాక.

16. భూమిమీద, ఆకాశంలో నివసించే ప్రాణులమంతా ఇక్కడ ఏకత్రితులమై దేవతలు, మానవులు పూజించే ధర్మమును నమస్కరిద్దాము. దీనివల్ల మనకందరికీ మంగళము కలుగుగాక.

17. భూమిమీద, ఆకాశంలో నివసించే ప్రాణులమంతా ఇక్కడ ఏకత్రితులమై దేవతలు, మానవులు పూజించే సంఘమును నమస్కరిద్దాము. దీనివల్ల మనకందరికీ మంగళము కలుగుగాక.

18. ఈ స్థిరమైన సత్యప్రభావంతో నా దుఃఖములన్నీ నశించుగాక. ఈ స్థిరమైన సత్యప్రభావంతో నా భయములన్నీ ఉపశమించుగాక. ఈ స్థిరమైన సత్య ప్రభావంతో మా రోగములన్నీ ఉపశమించుగాక.



సమస్త ప్రాణులపై ప్రేమను చిలకరించి మైత్రిని సాధించాలి.

# మేత్త సుత్తము

(ఇతరుల దుఃఖాలను ఉపశమింపజేయడానికి ప్రేమతో కూడిన కారుణ్యా సుత్తం.)

ఒకసారి 500 మంది భిక్షువులు ధ్యానం చేయడానికని అడవికి బయలు దేరారు. అప్పుడా అడవిలో కొన్ని కనిపించని దుష్టశక్తుల ప్రభావంతో వారి ధ్యానంలో అంతరాయమేర్పడింది. తక్షణమే వారంతా బుద్ధుడి వద్దకు వచ్చి విషయాన్ని వివరించారు. బుద్ధుడు వారిని తిరిగి అదే స్థానం లోకి మైత్రి అనే ఆయుధం తీసుకొని వెళ్ళమని ఉపదేశించాడు. అప్పుడు బుద్ధుడు మైత్రిని గురించి వివరిస్తూ, మైత్రి ఎలా ఉంటుందో, మైత్రి అంటే ఏమిటో ఈ సుత్తం ద్వారా వివరిస్తాడు.

తరువాత భిక్షువులు తిరిగి అదే అడవికి వచ్చి మైత్రి అనే ప్రేమ - కార్యుణ్య భరిత భావనా మాహాత్మ్యాన్ని ఆ అదృశ్య శక్తులకు వివరించారు. అటు తరువాత వారేవిఘ్నమూ లేకుండా ధ్యానాన్ని కొనసాగించ గలిగారు. అంతవరకు వారిని బాధించిన ఆ దుష్టశక్తులే తరువాత పశ్చాత్తాపంతో వారిని సత్కరించాయి.

కాబట్టి ఈ సుత్తము ప్రేమ, కారుణ్యపూరిత భావనలను వ్యాపింప జేయడానికెంతో ముఖ్యమైనది. ఈ సుత్తాన్ని పఠించి ఇందులో చెప్పినట్లుగా ఆచరిస్తే మానవులకు సర్వవిఘ్నాలు నశించి, వారి జీవితంలో శాంతి సౌఖ్యాలు నెలకొంటాయి. వారు ఇతరులకు కూడా శాంతిని, సౌభాగ్యాన్ని అందించగలుగుతారు. సుఖంగా జీవించ గలుగుతారు.

## మేత్తసుత్తం

1. కరణీయ మత్థ కుసలేన
యన్తం సన్తం పదం అభిసమేచ్చ
సక్కో ఉజూ చ సూజూ చ
సువచో చస్స ముదు అనతిమాని

2. సన్తుస్సకో చ సుభరో చ
అప్పకిచ్చో చ సల్లహుక వుత్తి
సన్తిన్ద్రియో చ నిపకో చ
అప్పగబ్భో కులేసు అననుగిద్ధో

3. న చ ఖుద్ధం సమాచరే కించి
యేన విఞ్ఞూ పరే ఉపవదేయ్యుం
సుఖినో వా ఖేమినో హోన్తు
సబ్బే సత్తా భవన్తు సుఖితత్తా.

4. యే కేచి పాన భూతత్థి
తసా వా థావరా వా అనవసేసా
దీఘా వా యే మహన్తా వా
మజి 1మా - రస్స - కానుక థూలా.

5. దిట్ఠా వా యేవ అదిట్ఠా
యే చ దూరే వసన్తి అవిదూరే
భూతా వా సమ్భవేసీ వా
సబ్బే సత్తా భవన్తు సుఖితత్తా.

# మైత్రీసుత్తము

1. సత్కర్మలలో నిపుణుడై శాంతిధామాన్ని (నిర్వాణాన్ని) చేరదలచిన ప్రతీవ్యక్తి ఈ క్రింద చెప్పినట్లుగా వ్యవహరించాలి. ఋజుమార్గంలో నడవాలి. సంపూర్ణ ఋజువర్తనుడై, సద్వచనుడై, మృదువుగా మాట్లాడాలి. వినయశీలుడు కావాలి.

2. సులభంగా సంతృప్తిని పొందాలి. ఇతరులకు భారం కాకుండా సులభంగా జీవించాలి. జీవితంలో కొన్నైనా మంచి పనులను చేయాలి. సాధారణ జీవితం గడపాలి. ఇంద్రియాలను స్వాధీన పరచుకోవాలి. వివేకంతో వ్యవహరించాలి. నిర్లక్ష్యాన్ని వదిలి శ్రద్ధాళువుగా మారాలి. లోభ బుద్ధితో సంసారానికి అతుక్కుని ఉండకూడదు.

3. ప్రాజ్ఞులు తప్పుపట్టేట్టుగా ఒక చిన్న తప్పునైనా చేయకూడదు. సర్వప్రాణులూ సుఖసంతోషాలతో జీవించుగాక. జీవులంతా సంతుష్టాంతరంగులగుదురు గాక.

4. జగత్తులోని ప్రాణులంతా, బలహీనులు, బలవంతులు, ఉన్నతులు, గొప్పవారు, మధ్యములు, చిన్న, పెద్ద (అందరూ సుఖంగా ఉందురుగాక).

5. కనిపించేవారు, కనిపించనివారు, దూరంలో ఉన్నవారు, సమీపంలో ఉన్నవారు, గతంలో ఉన్నవారు, భవిష్యత్తులో ఉండబోయేవారు సర్వప్రాణులు సుఖంగా ఉందురుగాక.

6. న పరో పరం నికుబ్బేథ
నాతి మఞ్ఞేథ కత్థచి నం కంచి
బ్యారో - సనా పటిఘ-సఞ్ఞా
నాఞ్ఞమఞ్ఞస్స దుక్ఖ మిచ్ఛేయ్య

7. మాతా యథా నియం పుత్తం
ఆయుసా ఏకపుత్త మనురక్ఖే
ఏవమ్పి సబ్బ భూతేసు
మానసం భావయే అపరిమానం.

8. మేత్తఞ్చ సబ్బ లోకస్మిం
మానసం భావయే అపరిమానం
ఉద్ధం అధో చ తిరియం చ
అసంబాధం అవేరం అసపత్తం

9. తిట్ఠం చరం నిసిన్నో వా
సయానో వా యావ తస్స విగత మిద్ధో
ఏతం సతిం అదిట్ఠేయ్య
బ్రహ్మమేతం విహారం ఇధమాహు.

10. దిట్ఠిఞ్చ అనుపగమ్మ సీలవా
దస్సనేన సమ్పన్నో
కామేసు వినేయ్య గేధం
న హి జాతు గబ్భసేయ్యం పునరేతీతి.

11. ఏతేన సచ్చ వజ్జేన
సోత్థి మే* హోతు సబ్బదా.

6. ఒకరినొకరు వంచించుకొనగూడదు. ఎవ్వరుకాని తమను తాము గొప్పగా భావించుకొనగూడదు. కోపంతో గాని, దురుద్దేశ్యంతో గాని ఎవ్వరూ ఇతరుల కీడు కోరకూడదు.

7. తల్లి తన ఏకైక పుత్రుడిని ప్రేమతో రక్షించినట్లు జీవితంలో కష్టపడైనా మనిషి సర్వప్రాణుల యందు అపరిమితమైన ప్రేమను ప్రదర్శించాలి.

8. అపరిమితమైన మైత్రీ భావనలు సర్వలోకంలో వ్యాపించనీ. పైకి, క్రిందికి, ప్రక్కలకు, ఏ ఆటంకం లేకుండా, ద్వేషం లేకుండా శతృత్వం లేకుండా ఆ భావనలు అంతటా వ్యాపించనీ.

9. నిలబడినప్పుడు, నడిచేటప్పుడు, కూర్చున్నప్పుడు, పరుండినప్పుడు, మేల్కొని ఉన్నంతవరకు, ఎల్లప్పుడూ మనము అటువంటి మైత్రీ భావనాత్మక స్మృతితో మెసలాలి. దీనినే ప్రాజ్ఞులు బ్రహ్మ విహారమంటారు.

10. మిథ్యా దృష్టిజాలంలో పడకుండా శీలవంతుడై, అంతరిక దృష్టి గలవాడై లోభరహితుడై జీవిస్తే మనిషికి ఇక మళ్ళీ గర్భవాసం ఉండదు. జన్మంటూ ఉండనే ఉండదు.

11. ఈ సత్యాన్ని దృఢంగా మననం చేయడం వల్ల నాకు సర్వదా మంగళము కలుగుగాక.

## మహా జయ మంగళ గాథా

(రక్షణ - అనుగ్రహములకొరకు పఠించదగినది)

1. మహా కారుణికో నాథో
హితాయ సబ్బ పాణినం
పూరేత్వా పారమి సబ్బా
పత్తో సమ్బోధి ముత్తమం.
ఏతేన సచ్చ వజ్జేన
హోతు మే జయ మంగళం.

2. జయన్తో బోధియా మూలే
సక్యానం నన్ది వద్ధనో
ఏవం మయ్హం జయో హోతు
జయస్సు జయ మంగళం.

3. సక్కత్వా బుద్ధ రతనం
ఓసధం ఉత్తమం వరం
హితం దేవ - మనుస్సానం
బుద్ధ తేజేన సొత్థినా
నస్సన్తుపద్దవా సబ్బే
దుక్ఖా వూపసమన్తు మే *

---

* ఇతరులకొరకు చదివేటప్పుడు 'మే'ని 'తే'గా చదవాలి.

# మహా జయ మంగళ గాథ

1. కరుణామయుడైన ఆ ప్రభువు సర్వప్రాణుల హితం కోరి అన్ని పారమితలను ఆచరించి సమ్బోధిని (Enlightenment) పొందాడు. ఈ సత్య ప్రభావంతో నాకు మంగళప్రదమైన జయము సిద్ధించుగాక.

2. బోధి వృక్ష మూలంలో విజయాన్ని సాధించి శాక్యుల సంతోషాన్ని ద్విగుణీకృత పరచిన బుద్ధుడి వలె నాకు కూడా జయం ప్రాప్తించుగాక. సర్వదా మంగళ ప్రదమైన జయము సిద్ధించుగాక.

3. రత్నాలన్నిటిలో ఉత్తమ రత్నమై, శ్రేష్ఠమైన ఔషధమై, దేవతలకు, మనుషులకు హితకరుడై విలసిల్లే బుద్ధున్ని నేను నిత్యమూ పూజిస్తాను. ఆ బుద్ధుని తేజంతో, మంగళ ప్రదమైన భావనలతో, ఉపద్రవాలన్నీ నశించుగాక, సర్వదుఃఖాలూ ఉపశమించుగాక.

4. సక్కత్వా ధమ్మ రతనం
ఓసధం ఉత్తమం వరం
పరిలాహూపసమనం
ధమ్మ తేజేన సొత్థినా
నస్సన్తుపద్దవా సబ్బే
భయా వూపసమన్తు మే *

5. సక్కత్వా సంఘరతనం
ఓసధం ఉత్తమం వరం
ఆహునేయ్యం పాహునేయ్యం
సంఘ తేజేన సొత్థినా
నస్సన్తుపద్దవా సబ్బే
రోగా వూపసమేన్తు మే*

6. యం కించి రతనం లోకే
విజ్జతి వివిధా పుథు
రతనం బుద్ధ సమం నత్థి
తస్మా సొత్థి భవన్తు మే.*

7. యం కించి రతనం లోకే
విజ్జతి వివిధా పుథు
రతనం ధమ్మ సమం నత్థి
తస్మా సొత్థి భవన్తు మే*.

---

* ఇతరులకొరకు చదివేటప్పుడు 'మే'ని 'తే'గా చదవాలి.

4. ఉత్తమ రత్నమై, శ్రేష్ఠమైన ఔషధమై, బాధలను ఉపశమింప జేయగల ధర్మరత్నాన్ని నేను నిత్యమూ గౌరవిస్తాను. ఈ ధర్మ తేజంతో, దాని కళ్యాణకరణమైన ప్రభావంతో, ఉపద్రవాలన్నీ ఉపశమించుగాక. భయములన్నీ నశించుగాక.

5. ఉత్తమము, శ్రేష్ఠము ఐన సంఘరత్నము అతిధ్యానికి యోగ్యమైనది. ఈ సంఘ తేజంతో, దాని మంగళమయ భావంతో సర్వోపద్రవాలు నశించనీ. సర్వరోగములు ఉపశమించనీ.

6. ఈ ప్రపంచంలో ఉన్న అన్ని రత్నాలలో బుద్ధునివంటి దివ్య రత్నం మరొకటి లేదు. ఆ బుద్ధుడి ప్రభావం వల్ల నాకు మంగళం కలుగు గాక.

7. ఈ విశ్వంలోని అమూల్యమైన నానారత్నాలలోకెల్లా ధర్మరత్నం లాంటిది మరొకటి లేదు. ఆ ధర్మరత్న ప్రభావంతో నాకు మంగళం కలుగుగాక.

8. యం కించి రతనం లోకే
విజ్జతి వివిధా పుథు
రతనం సంఘసమం నత్థి
తస్మా సొత్థి భవన్తు మే*.

9. నత్థి మే సరనం అఞ్ఞం
బుద్ధో మే సరనం వరం
ఏతేన సచ్చ వజ్జేన
హోతు మే* జయమంగళం.

10. నత్థి మే సరనం అఞ్ఞం
ధమ్మో మే సరనం వరం
ఏతేన సచ్చ వజ్జేన
హోతు మే* జయమంగళం

11. నత్థి మే సరనం అఞ్ఞం
సంఘో మే సరనం వరం
ఏతేన సచ్చ వజ్జేన
హోతు మే* జయ మంగళం.

---

* ఇతరులకొరకు చదివేటప్పుడు 'మే'ని 'తే'గా చదవాలి.

8. లోకంలో అమూల్యమైన వివిధ రత్నాలలో సంఘ రత్నం వంటిది మరోటి లేదు. ఆసంఘ రత్నం వల్ల నాకు మంగళం కలుగుగాక.

9. బుద్ధుడు తప్ప నాకు ఇతర శరణమేదీ లేదు. ఈ సత్య కథన ప్రభావంతో నాకు మంగళప్రదమైన జయము సిద్ధించుగాక.

10. ధర్మం తప్ప నాకీ లోకంలో మరో శరణ మేదీలేదు. ఈ సత్యకథన ప్రభావంతో నాకు మంగళప్రదమైన జయము సిద్ధించుగాక.

11. సంఘం తప్ప నాకీలోకంలో మరో శరణమేదీ లేదు. ఈ సత్య కథన ప్రభావంతో నాకు మంగళప్రదమైన జయము సిద్ధించుగాక.

# దసధమ్మ సుత్తం

ఏవం మే సుతం ఏకం సమయం భగవా సావత్థియం విహరతి జేతవనే అనాథపిణ్డికస్స ఆరామే. తత్ర ఖో భగవా భిక్ఖూ ఆమన్తేసి; "భిక్ఖవో' తి", భదన్తే'తి తే భిక్ఖూ భగవతో పచ్చస్సోసుం. భగవా ఏతదవోచ; "దస ఇమే భిక్ఖవే ధమ్మా పబ్బజితేన అభిణ్హం పచ్చవేక్ఖితబ్బా". కతమే దస? వేవణ్ణియమ్హి అజ్ఝ్ ఉపగతో'తి పబ్బజితేన అభిణ్హం పచ్చ వేక్ఖితబ్బం. పరపటిబద్ధా మే జీవికా'తి పబ్బజితేన అభిణ్హం పచ్చవేక్ఖితబ్బం. "అఞ్ఞో మే ఆకప్పో కరణీయో' తి. 'కచ్చి ను ఖో మే అత్తా సీలతో న అపవదతీతి ... కచ్చిను ఖో మం అనువిచ్చ విఞ్ఞూ సబ్రహ్మచారీ సీలతో న ఉపవదన్తీ'తి ........... సబ్బేహి మే పియేహి మనాపేహి నానాభావో వినా భావో'తి ....... కమ్మస్సకో'మ్హి; కమ్మదాయాదో, కమ్మయోని, కమ్మబన్ధు, కమ్మ పటిసరణో; యం కమ్మం కరిస్సామి కల్యాణం వా పాపకం వా తస్స దాయాదో భవిస్సామీతి ........ కథమ్భూతస్స మే రత్తిన్దివా వీతిపతన్తీ'తి ........ కచ్చిను ఖో'హం సుఞ్ఞాగారే అభిరమామీతి ....... అత్థి ను ఖో మే ఉత్తరిమనుస్స ధమ్మా, అలం అరియ ఞాణదస్సన విసేసో అభిగతో? సో'హం పచ్ఛిమే కాలే సబ్రహ్మచారీహి పుట్ఠో న మఙ్కు భవిస్సామీతి. ఇమే ఖో భిక్ఖవే దసధమ్మా పబ్బజితేన అభిణ్హం పచ్చవే క్ఖితబ్బా"తి. ఇదం అవోచ భగవా అత్తమనా, తే భిక్ఖూ భగవతో భాసితం అభినన్దుం'తి.

# దశధర్మ సుత్తము

నేనిలా విన్నాను, ఒకానొక సమయంలో బుద్ధభగవానుడు శ్రావస్తీ నగరపు జేతవనంలోని అనాథపిండికుని ఆరామంలో విహరిస్తున్నాడు. అప్పుడు బుద్ధభగవానుడు అక్కడున్న భిక్షువులనందరినీ "భిక్షువులారా!" అని పిలిచే సరికి "చెప్పండి భదన్తే"అని వారు బదులు పలికారు. అప్పుడు బుద్ధుడు వారితో ఇలా అన్నాడు - "భిక్షువులారా! ఈ పది ధర్మాలను ప్రవ్రజితుడైన వాడు నిరంతరం మనస్సులో భావన చేయాలి. ఏమిటా పదిధర్మాలు?"

నేను వర్ణరహిత స్థితికి చేరుకున్నానని ప్రవజితుడు నిరంతరం మనస్సులో భావన చేయాలి. నా జీవనోపాధి ఇతరులకొరకేనని ప్రవ్రజితుడు నిరంతరం మనస్సులో భావన చేయాలి. అదేవిధంగా నాప్రవర్తన సరిగా లేనట్లైతే మరొక విధమైన ప్రవర్తన అలవరచుకోవాలని, నా నడవడికను చూసి నా ఆత్మ (మనస్సు) నన్ను నిందించదని, విజ్ఞులైన నాతోటివారు పరీక్షగా నా ప్రవర్తన చూసినట్లైతే నన్ను నిందించగలరని, ప్రియమైన వారి నుండి, కావలసిన వారినుండి సంగరాహిత్యము నాకు సిద్ధిస్తుందని, నా కర్మే నాకు నిజమైన ఆస్తి అని, నేను నా కర్మలకు వారసుడినని, నా కర్మలు నా పునర్జన్మకు కారణమౌతాయని, కర్మే నా బంధువని, కర్మే నాకు శరణమని, మంచి, చెడు ఏవిధమైన కర్మలు చేసినా వాటికి నేనే వారసున్నవుతానని, ఎలాంటి స్థితిలో నా రాత్రిందివములు గడిచి పోతాయోనని, బహుశా నేను శూన్యాగారంలో (మౌన గృహంలో) ఆనందాన్ని పొందగలనని, మనుష్యాతీతములైన కర్మలు నాలో ఉన్నాయని, నేను ఉన్నతమైన జ్ఞానమును పొందానని, చివరి దశలో నాతోటి వారు నన్నడిగిన ప్రశ్నలకు నేను మోహపడనని, ఓ భిక్షువులారా! ఈ దశధర్మాలను ప్రవ్రజితుడైన వాడు నిరంతరం తన మనస్సులో భావన చేయాలి.

ఈ విధంగా బుద్ధుడు చెప్పే సరికి సంతుష్టాంతరంగులైన ఆ భిక్షువులంతా అతడి మాటలను అభినందించారు.

# పరాభవసుత్తం

ఏవం మే సుతం: ఏకం సమయం భగవా సావత్థియం విహరతి జేతవనే అనాథపిణ్డికస్స ఆరామే. అథ ఖో అఞ్ఞతరా దేవతా, అభిక్కన్తాయ రత్తియా అభిక్కన్త వణ్ణా కేవలకప్పం జేతవనం ఓభాసేత్వా, యేన భగవా తేనుపసఙ్కమి.

ఉపసఙ్కమిత్వా భగవన్తం అభివాదేత్వా ఏకమన్తం అట్ఠాసి. ఏకమన్తం ఠితా ఖో సా దేవతా భగవన్తం గాథాయ అజ్ఝభాసి.

1. పరాభవన్తం పురిసం
   మయం పుచ్ఛామ గోతమం
   భగవన్తం పుట్ఠు మాగమ్మ
   కిం పరాభవతో ముఖం?
2. సువిజానో భవం హోతి
   సువిజానో పరాభవో
   ధమ్మకామో భవం హోతి
   ధమ్మదేస్సీ పరాభవో.
3. ఇతిహేతం విజానామ
   పఠమో సో పరాభవో
   దుతియం భగవా బ్రూహి
   కిం పరాభవతో ముఖం?

# పరాభవ సుత్తము

నేనిలా విన్నాను. ఒకానొక సమయంలో బుద్ధ భగవానుడు శ్రావస్తీ నగరపు జేతవనం లోని అనాథపిండకుని ఆరామంలో విహరిస్తున్నాడు. అప్పుడు బాగా రాత్రయ్యాక ఒక దేవత ఉత్కృష్ట వర్ణముగలదై జేతవనాన్నంతా తన ప్రభలతో ప్రకాశవంతమొనర్చి బుద్ధభగవానుడున్న చోటికి చేరుకున్నది. చేరుకొని బుద్ధుడిని నమస్కరించి ఒక ప్రక్కన నిల్చొని బుద్ధభగవానుడితో గాథారూపంలో ఇలా అన్నది .....

1. గౌతమా! జీవితంలో పతితుడైన వాడెవడు? ఈ ప్రశ్నే నిన్నడగాలని వచ్చాము. ఏ కారణం చేత మనిషి పతితుడౌతాడు?

బుద్ధుడు ఇలా బదులిచ్చాడు.

2. ఉత్తముడెవడో, పతితుడెవడో మనకు సులభంగానే తెలుస్తుంది. ఉత్తముడు సర్వదా ధర్మాన్ని అభిలషిస్తాడు. ఆ ధర్మాన్ని ద్వేషించే వాడే పతితుడు.

3. ఈ మొదటి కారణం మాకు అర్థమయ్యింది. భంతే, రెండవ కారణమేమిటో చెప్పు. మనిషి పతితుడు కావడానికి కారణమేమిటో చెప్పు.

4. అసన్తస్స పియా హోన్తి
సన్తే న కురుతే పియం
అసతం ధమ్మం రోచేతి
తం పరాభవతో ముఖం

5. ఇతి హేతం విజానామ
దుతియో సో పరాభవో
తతియం భగవా బ్రూహి
కిం పరాభవతో ముఖం?

6. నిద్దాసిలీ సభాసిలీ
అనుట్ఠాతా చ యో నరో
అలసో కోధ పఞ్ఞాణో
తం పరాభవతో ముఖం

7. ఇతి హేతం విజానామ
తతియో సో పరాభవో
చతుత్థం భగవా బ్రూహి
కిం పరాభవతో ముఖం?

8. యో మాతరం వా పితరం వా
జిణ్ణకం గతయొబ్బనం
పహూసన్తో న భరతి
తం పరాభవతో ముఖం



4. చెడ్డవారతనికెంతో ఇష్టులు. మంచి వాళ్లంటే అతడికెప్పుడూ ఇష్టం ఉండదు. చెడ్డవారి ధర్మమంటే అతడికిష్టం. ఇదే మనిషి పతితుడు కావడానికి కారణము.



5. భంతే, ఈ రెండవకారణం మాకు అర్థమయ్యింది. ఇక మూడవ కారణమేమిటో చెప్పు. మనిషి పతితుడు కావడానికి కారణమేమిటో చెప్పు.



6. అతడికి నిద్ర అంటే ఎంతో ఇష్టం. మిత్రులతో కాలక్షేపం ఇష్టం. అతడు శక్తివిహీనుడైన వాడు, సోమరి. అతడి స్పష్టమైన గురుతు కోపం. ఇదే మనిషి పతితుడు కావడానికి కారణము. 

7. భంతే, ఈ మూడవ కారణం మాకు అర్థమయ్యింది. ఇక నాలుగవ కారణమేమిటో చెప్పు. మనిషి పతితుడువడానికి కారణమేమిటో చెప్పు.

8. బాగా ధనం ఉండి కూడా తల్లిని, తండ్రిని, వృద్ధులను ఎవ్వడు భరించడో అతడు పతితుడు. ఇదే మనిషి పతితుడు కావడానికి కారణము.

9. ఇతి హేతం విజానాము
చతుత్థో సో పరాభవో
పఞ్చమం భగవా బ్రూహి
కిం పరాభవతో ముఖం?

10. యో బ్రాహ్మణం వా సమణం వా
అఞ్ఞం వాపి వణిబ్బకం
ముసావాదేన వఞ్చేతి
తం పరాభవతో ముఖం

11. ఇతిహేతం విజానామ
పఞ్చమో సో పరాభవో
ఛట్ఠమం భగవా బ్రూహి
కిం పరాభవతో ముఖం?

12. పహూత విత్తో పురిసో
సహిరఞ్ఞో సభోజనో
ఏకో భుఞ్జతి సాధూని
తం పరాభవతో ముఖం?

13. ఇతిహేతం విజానామ
ఛట్ఠమో సో పరాభవో
సత్తమం భగవా బ్రూహి
కిం పరాభవతో ముఖం?

9. భంతే, ఈ నాలుగవ కారణం మాకు అర్థమయ్యింది. ఇక ఐదవ కారణమేమిటో చెప్పు. మనిషి పతితుడువడానికి కారణమేమిటో చెప్పు.

10. ఎవడైతే బ్రాహ్మణుడిని, శ్రమణుడిని, లేక బాటసారిని అసత్యభాషణంతో వంచిస్తాడో, అతడే పతితుడు. ఇదే మనిషి పతితుడు కావడానికి కారణము.

11. భంతే, ఈ ఐదవ కారణము మాకు అర్థమయ్యింది. ఇక ఆరవ కారణమేమిటో చెప్పు. మనిషి పతితుడువడానికి కారణమేమిటో చెప్పు.

12. బాగా డబ్బుండి, బంగారం బాగా సంపాదించి, పుష్కలమైన ఆహారధాన్యాలు కలిగి మనిషి ఒకవేళ ఒంటరిగానే ఆ రుచికరపదార్థాలను అనుభవిస్తే వాడు పతితుడని గుర్తించాలి. ఇదే మనిషి పతితుడు కావడానికి కారణము.

13. భంతే, ఈ ఆరవ కారణము మాకు అర్థమయ్యింది. ఇక ఏడవ కారణమేమిటో చెప్పు. మనిషి పతితుడు కావడానికి కారణమేమిటో చెప్పు.

14. జాతిత్థద్ధో ధనత్థద్ధో
గోత్తత్థద్ధో చ యో నరో
సఞ్ఞాతిం అతిమఞ్ఞేతి
తం పరాభవతో ముఖం?

15. ఇతి హేతం విజానామ
సత్తమో సో పరాభవో
అట్ఠమం భగవా బ్రూహి
కిం పరాభవతో ముఖం?

16. ఇత్థిధుట్టో సురాధుట్టో
అక్ఖధుట్టో చ యో నరో
లద్ధం లద్ధం వినాసేతి,
తం పరాభవతో ముఖం.

17. ఇతి హేతం విజానామ
అట్ఠమో సో పరాభవో
నవమం భగవా బ్రూహి
కిం పరాభవతో ముఖం?

18. సేహి దారేహి, సన్తుట్ఠో
వేసియాసు పదిస్సతి
దిస్సతి పరదారేసు
తం పరాభవతో ముఖం?

14. వంశము, ధనము, తెగ; ఇలాంటి వాటిని పట్టుకుని మూర్ఖంగా ఆలోచించేవాడు; తన బంధువులనే నిర్లక్ష్యం చేసేవాడు, పతితుడు. ఇదే మనిషి పతితుడు కావడానికి కారణము.

15. భంతే, ఈ ఏడవ కారణం మాకు అర్థమయ్యింది. ఇక ఎనిమిదవ కారణమేమిటో చెప్పు. మనిషి పతితుడు కావడానికి కారణమేమిటో చెప్పు.

16. స్త్రీలను కామించేవాడు. తాగుబోతు, జూదమాడేవాడు, తనకు లభించిన ప్రతీదాన్ని నాశనం చేసేవాడు, పతితుడు. ఇదే మనిషి పతితుడు కావడానికి కారణము.

17. భంతే, ఈ ఎనిమిదవ కారణం మాకు అర్థమయ్యింది. ఇక తొమ్మిదవ కారణమేమిటో చెప్పు. మనిషి పతితుడు కావడానికి కారణమేమిటో చెప్పు.

18. తన భార్యతో సంతృప్తి పడనివాడు, వేశ్యల మధ్యన కనిపించేవాడు, ఇతరుల భార్యలను మోహించేవాడు; పతితుడు. ఇదే మనిషి పతితుడు కావడానికి కారణము.

19. ఇతి హేతం విజానామ
నవమో సో పరాభవో
దసమం భగవా బ్రూహి
కిం పరాభవతో ముఖం.

20. అతీత యోబ్బనో పోసో
ఆనేతి తిమ్బరు త్థనిం
తస్సా ఇస్సా న సుపతి
తం పరాభవతో ముఖం

21. ఇతి హేతం విజానామ
దసమో సో పరాభవో
ఏకాదసమం భగవా బ్రూహి
కిం పరాభవతో ముఖం?

22. ఇత్థిం సోణ్డిం వికిరణిం
పురిసం వాపి తాదిసం,
ఇస్సరి యస్మిం థపాపేతి
తం పరాభవతో ముఖం.

23. ఇతిహేతం విజానామ
ఏకాద సమో సో పరాభవో
ద్వాదసమం భగవా బ్రూహి
కిం పరాభవతో ముఖం?

19. భంతే, ఈ తొమ్మిదవ కారణం మాకు అర్ధమయ్యింది. ఇక పదవ కారణమేమిటో చెప్పు. మనిషి పతితుడు కావడానికి కారణమేమిటో చెప్పు.

20. గతయవ్వనుడు తింబరి* పండ్లలాంటి చన్నులు గల కన్యను తెచ్చి ఆమెపై ఈర్ష్యతో నిద్రపోడు. ఇలాంటి వాడు పతితుడు. ఇదే మనిషి పతితుడు కావడానికి కారణము.

21. భంతే, ఈ పదదవ కారణం మాకు అర్ధమయ్యింది. ఇక పదకొండవ కారణమేమిటో చెప్పు. మనిషి పతితుడు కావడానికి కారణమేమిటో చెప్పు.

22. తాగుడుకు అలవాటు పడి జీవితాన్ని ఛిన్నాభిన్నం చేసుకొన్న స్త్రీని, అదేవిధమైన పురుషుడిని ఎవడైతే తన సంపదను పరిరక్షించడానికి నియమిస్తాడో అతడు పతితుడైనవాడు. ఇదే మనిషి పతితుడు కావడానికి కారణము.

23. భంతే, ఈ పదకొండవ కారణం మాకు అర్ధమయ్యింది. ఇక పన్నెండవ కారణమేమిటో చెప్పు. మనిషి పతితుడు కావడానికి కారణమేమిటో చెప్పు.

* తింబరి పండు చాలా చిన్నది. వయస్సులో చిన్నది అని అర్థం.

24. అప్పభోగో మహాతణ్హో
ఖత్తియే జాయతే కులే
సో చ రజ్జం పత్థయతి
తం పరాభవతో ముఖం

25. ఏతే పరాభవే లోకే
పణ్డితో సమవేక్ఖియ
అరియో దస్సనసమ్పన్నో
స లోకం భజతే సివం'తి.

24. స్వల్పమైన సంపదను కలిగి ఉండి, విపరీతమైన ఆశ గనక ఉంటే అతడు పతితుడు. అంతేకాదు, క్షత్రియకులంలో జన్మించినవాడు, రాజ్యకాంక్ష కలిగిన వాడు పతితుడు. ఇదే మనిషి పతితుడు కావడానికి కారణము.

25. మనిషి పతితుడు కావడానికి ఇవి కారణాలు. వీటిని బాగా అర్థంచేసుకొని, ఆంతరికక దృష్టిని కలిగిన జ్ఞాని. శాంతి, సౌఖ్యములతో లోకంలో జీవించగలుగుతాడు.

# వసల సుత్తం

ఏవం మే సుతం; ఏకం సమయం భగవా సావత్థియం విహరతి జేతవనే అనాథపిణ్డికస్స ఆరామే. అథ ఖో భగవా పుబ్బణ్హ సమయం నివాసేత్వా పత్త చీవరమాదాయ సావత్థియం పిణ్డాయ పావిసి. తేన ఖో పన సమయేన అగ్గికభారద్వాజస్స బ్రాహ్మణస్స నివేసనే అగ్గి పజ్జలితో హోతి ఆహుతి పగ్గహితా. అథ ఖో భగవా సావత్థియం సపదానం పిణ్డాయ చరమానో యేన అగ్గిక భారద్వాజ బ్రాహ్మణస్స నివేసనం తేనుపసఙ్కమి. అద్దసా ఖో అగ్గికభారద్వాజో బ్రాహ్మణో భగవన్తం దూరతో వ ఆగచ్ఛన్తం. దిస్వాన భగవన్తం ఏతదవోచ. "తత్రేవ ముణ్డక తత్రేవ సమణక తత్రేవ వసలక తిట్ఠాహీ"తి. ఏవం వుత్తే భగవా అగ్గికభారద్వాజం బ్రాహ్మణం ఏతదవోచ. "జానాసి పన త్వం బ్రాహ్మణ వసలం వా వసలకరణే వా ధమ్మే"? తి "నఖ్వాహం భో గోతమ జానామి వసలం వా వసలకరణే వా ధమ్మే. సాధు మే భవం గోతమో తథా ధమ్మం దేసేతు యథాహం జానేయ్యం వసలం వా వసలకరణే వా ధమ్మే"తి. తేన హి బ్రాహ్మణ సుణాహి సాధుకం మనసి కరోహి. భాసిస్సామీ'తి. ఏవంభో'తి ఖో అగ్గికభారద్వాజో బ్రాహ్మణో భగవతో పచ్చస్సోసి. భగవా ఏతదవోచ:

# వృషల సుత్తము

నేనిలా విన్నాను. ఒకానొక సమయంలో బుద్ధభగవానుడు శ్రావస్తీనగరపు జేతవనంలోని అనాథ పిండకుని ఆరామంలో విహరిస్తున్నాడు. అప్పుడు బుద్ధుడు పూర్వాహ్న సమయంలో వస్త్రములను ధరించి భిక్షాపాత్రను, చీవరమును తీసుకొని భిక్షాయాచనకై శ్రావస్తీ నగరంలోనికి ప్రవేశించాడు. అప్పుడు అగ్గిక భారద్వాజుడనే బ్రాహ్మణుడి వాసస్థలంలో అగ్నిని ప్రజ్వలింప జేసి ఆహుతుల నివ్వడం మొదలుపెట్టారు. ఆ శ్రావస్తీ నగరంలో ఇంటింటా భిక్షాయాచన చేస్తూ బుద్ధ భగవానుడు ఈ అగ్గిక భారద్వాజుని నివాసానికి చేరుకున్నాడు. తన వాసస్థలానికేసి వస్తున్న బుద్ధుడిని దూరంనుండి చూసి అగ్గిక భారద్వాజుడు ఇలా అన్నాడు: "ఓ ముండక! (తలపై వెంట్రుకలు లేనివాడా!) అక్కడే ఆగు. ఓ శ్రమణా! అక్కడే ఆగు, ఓ శూద్రుడా! అక్కడే ఆగిపో". అది విన్న బుద్ధుడు ఆ అగ్గిక భారద్వాజుడితో ఇలా అన్నాడు:- "ఓ బ్రాహ్మణా! నీ కసలు శూద్రుడంటే ఎవరో తెలుసా? మనిషి ఏ గుణాల చేత శూద్రుడవుతాడో నీకు తెలుసా?" అప్పుడు అగ్గిక భారద్వాజుడు - " ఓ గౌతమా! నాకు నిజంగా శూద్రుడెవడో, ఏ గుణాల చేత మనిషి శూద్రుడౌతాడో తెలియదు. ఆ విషయాలన్నీ మీరు నాకు వివరిస్తే బాగుంటుంది. దానివల్ల నాకు శూద్రుడెవరో అతడి గుణాలేమిటో తెలుస్తుంది" అన్నాడు. 'అయితే బ్రాహ్మణా! విను. విని మనస్సులో సతతమూ ఉంచుకో. ఇదిగో చెప్పుతున్నాను' బ్రాహ్మణుడు సరేనన్నాడు. బుద్ధుడిలా చెప్పడం మొదలు పెట్టాడు.

1. కోధనో ఉపనాహీ చ
పాపమక్ఖి చ యో నరో
విపన్నాదిట్ఠి మాయావీ
తం జఞ్ఞా వసలో ఇతి.

2. ఏకజం వా ద్విజం వాపి
యోధ పాణాని హింసతి
యస్స పాణే దయా నత్థి
తం జఞ్ఞా వసలో ఇతి

3. యో హన్తి పరిరున్ధతి
గామాని నిగమాని చ
నిగ్గహకో సమఞ్ఞాతో
తం జఞ్ఞా వసలో ఇతి.

4. గామే వా యది వారఞ్ఞే
యం పరేసం మమాయితం
థెయ్యా అదిన్నం ఆదియతి
తం జఞ్ఞా వసలో ఇతి.

5. యో హవే ఇణమాదాయ
చుజ్జమానో పలాయతి
న హి తే ఇణమత్థీతి
తం జఞ్ఞా వసలో ఇతి

1. కోపిష్టి, ఎప్పుడూ గొణిగేవాడు, పాపిష్టి, వంచకుడు, సద్దృష్టి లేనివాడు, మాయావి అయినవాడు శూద్రుడని గుర్తించు.

2. ఏకజుడైనా, ద్విజుడైనా ప్రపంచంలో ప్రాణులను హింసించేవాడు, సమస్త జీవరాశి పట్ల దయ లేనివాడు నిజానికి శూద్రుడని గుర్తించు.

3. తోటి ప్రాణులను చంపేవాడు, గ్రామాలను, నిగమాలను (suburbs) ముట్టడించేవాడు. ఆందోళన కారుడిగా పేరెమోసినవాడు శూద్రుడని గుర్తించు.

4. గ్రామంలోనైనా, అరణ్యంలో నైనా ఇతరులకు చెందిన వాటిని, తనకు ఇవ్వని వాటిని దొంగబుద్ధితో అపహరించే వాడు శూద్రుడని గుర్తించు.

5. అప్పుచేసి అందరూ అతన్ని నిందిస్తుండగా పారిపోయే వాడు, పైగా నీకు నేనేమీ అప్పుపడలేదని చెప్పేవాడు, శూద్రుడని గుర్తించు.

6. యో వే కిఞ్చిక్ఖ కమ్యతా
పన్థస్మిం వజతం జనం
హన్త్వా కిఞ్చిక్ఖ మాదేతి
తం జఞ్ఞా వసలో ఇతి.

7. యో అత్తహేతు పరహేతు
ధనహేతు చ యో నరో
సక్ఖీ పుట్ఠో ముసా బ్రూతి
తం జఞ్ఞా వసలో ఇతి.

8. యో ఞాతినం సఖానం వా
దారేసు పతిదిస్సతి
సహసా సమ్పియేన వా
తం జఞ్ఞా వసలో ఇతి.

9. యో మాతరం వా పితరం వా
జిణ్ణకం గతయొబ్బనం
పహుసన్తో న భరతి
తం జఞ్ఞా వసలో ఇతి.

10. యో మాతరం వా పితరం వా
భాతరం భగినిం ససుం
హన్తి రోసేతి వాచాయ
తం జఞ్ఞా వసలో ఇతి.

6. బలవంతంగా ఇతరుల వస్తువులను లాక్కునేవాడు, మార్గంలో వెళుతున్నప్పుడు ఎదురుపడ్డవారిని చంపి ఏది దొరికితే అది తీసుకొనే వాడు శూద్రుడని గుర్తించు.

7. సాక్ష్యమిమ్మని పిలిస్తే తన లాభం కొరకో, పరుల లాభంకొరకో, డబ్బులకొరకో అబద్ధపు సాక్షాలు చెప్పేవాడు శూద్రుడని గుర్తించు.

8. బలవంతంగానైనా లేక వారి అంగీకారంతోనైనా ఎవ్వడైతే తన బంధువుల లేక మిత్రుల భార్యలను కామిస్తాడో వాడు శూద్రుడని గుర్తించు.

9. సంపన్నుడై గూడా ఎవడైతే తన తల్లిని తండ్రిని వృద్ధులను పోషించడో వాడు శూద్రుడని గుర్తించు.

10. తన తల్లిని, తండ్రిని, సోదరులను అక్కాచెల్లెళ్లను, అత్తామామలను పరుషమైన మాటలతో అస్తమానమూ వేధించేవాడు శూద్రుడని గుర్తించు.

11. యో అత్థం పుచ్ఛితో సన్తో
అనత్థం అనుసాసతి
పటిచ్ఛన్నేన మన్తేతి
తం జఞ్ఞా వసలో ఇతి.

12. యో కత్వా పాపకం కమ్మం
మా మం జఞ్ఞాతి ఇచ్ఛతి,
యో పటిచ్ఛన్నక కమ్మన్తో
తం జఞ్ఞా వసలో ఇతి.

13. యో వే పరకులం గన్త్వా
భుత్వాన సుచీ భోజనం
ఆగతం న పటిపూజేతి
తం జఞ్ఞా వసలో ఇతి.

14. యో బ్రాహ్మణం వా సమణం వా
అఞ్ఞం వాపి వణిబ్బకం
ముసావాదేన వఞ్చేతి
తం జఞ్ఞా వసలో ఇతి.

15. యో బ్రాహ్మణం వా సమణం వా
భత్తకాలే ఉపట్ఠితే
రోసేతి వాచా న చ దేతి
తం జఞ్ఞా వసలో ఇతి.

11. ఆత్మను గురించి అడిగితే అనాత్మను గురించి వివరించేవాడు; అంటే నైతిక విషయాలను చెప్పమంటే అధార్మిక, అనిత్య విషయాలను వివరించేవాడు, రహస్యంగా ఉపదేశించేవాడు శూద్రుడని గుర్తించు.

12. చెడ్డపనులు చేసి ఇతరులెవ్వరూ వాటి గురించి తెలుసుకోగూడదను కొనేవాడు, రహస్యంగా పనులు చేసేవాడు శూద్రుడని గుర్తించు.

13. ఇతరుల ఇండ్లకు వెళ్ళి రుచికరమైన ఆహారాన్ని భుజించి వారు మళ్ళీ తన ఇంటికి వచ్చినప్పుడు అతిథిసత్కారం చేయని వాడు శూద్రుడని గుర్తించు.

14. తన అసత్యభాషణంతో బ్రాహ్మణుడిని, శ్రమణుడిని లేక బాటసారిని వంచించేవాడు శూద్రుడని గుర్తించు.

15. భోజన సమయంలో వచ్చిన బ్రాహ్మణుడినైనా, శ్రమణుడినైనా, కోపంతో తిట్టి ఆహారాన్నివ్వకుండా పంపించేవాడు శూద్రుడని గుర్తించు.

16. అసతం యోధ పబ్రూతి
మోహేన పళిగుణ్ఠితో
కిఞ్చిక్ఖం నిజిగిం సానో
తం జఞ్ఞా వసలో ఇతి.

17. యో చత్తానం సముక్కం సే
పరం చమవజానతి,
నీహీనో సేన మానేన
తం జఞ్ఞా వసలో ఇతి.

18. రోసకో కదరియో చ
పాపిచ్ఛో మచ్ఛరీ సఠో
అహిరికో అనోత్తాపీ
తం జఞ్ఞా వసలో ఇతి.

19. యో బుద్ధం పరిభాసతి
అథవా తస్స సావకం
పరిబ్బాజం గహట్ఠం వా
తం జఞ్ఞా వసలో ఇతి.

20. యో వే అనరహా సన్తో
అరహం పటిజానతి
చోరో సబ్రహ్మకే లోకే
ఏస ఖో వసలాధమో
ఏతే ఖో వసలా వుత్తా
మయా వో యే పకాసితా.

16. నిజం కాని దాన్ని గురించి చెప్పేవాడు అజ్ఞానం బాగా పెరిగి చివరకు చిన్నచిన్న వస్తువులను గూడా దొంగిలించేవాడు శూద్రుడని గుర్తించు.

17. తనను తానే పొగడుకొనేవాడు, ఇతరులను మాత్రం ఎల్లప్పుడూ నిర్లక్ష్యం చేసేవాడు అహంకారంతో దిగజారినవాడు శూద్రుడని గుర్తించు.

18. కోపిష్టి, లోభి, పాపి, మత్సరి, మొండి, సిగ్గువిడినవాడు, అన్యాయమునకు వెరవనివాడు శూద్రుడని గుర్తించు.

19. బుద్ధుడిని, అతడి శిష్యున్ని ఇతర పరివ్రాజకున్ని లేక గృహస్థున్ని దూషించేవాడు శూద్రుడని గుర్తించు.

20. అర్హతత్వము సంపాదించకుండానే తాను అర్హతుడనని చెప్పుకొనేవాడు సమాజంలో దొంగలాంటివాడు. వాడు శూద్రునికంటే అధముడు. నిజానికి ఇలాంటి వారినే నేను శూద్రులంటాము.





21. న జచ్చా వసలో హోతి
న జచ్చా హోతి బ్రాహ్మణో
కమ్మనా వసలో హోతి
కమ్మనా హోతి బ్రాహ్మణో

22. తదామినాపి విజానాథ
యథా మే'దం నిదస్సనం
చణ్డాలపుత్తో సొపాకో
మాతఙ్గో ఇతి విస్సుతో

సో యసం పరమం పత్తో
మాతఙ్గో'యం సుదుల్లభం
ఆగఞ్ఛుం తస్సుపట్ఠానం
ఖత్తియా బ్రాహ్మణా బహూ
సో దేవయాన మారుయ్హ
విరజం సో మహాపథం
కామరాగం విరాజేత్వా
బ్రహ్మలోకూపగో అహూ.

21. జన్మతో ఎవ్వడూ శూద్రుడు కాజాలడు, జన్మతో ఎవ్వడూ బ్రాహ్మణుడు కాజాలడు. తను చేసే పనుల ద్వారా మనిషి శూద్రుడు లేక బ్రాహ్మణుడు అవుతాడు.

22. ఈ విషయాన్ని ఒక ఉదాహరణద్వారా తెలుసుకోవచ్చు; శ్వపాకుడైన చండాల పుత్రుడొకడు మాతంగుడిగా ప్రసిద్ధిగాంచాడు.

అతడు ఉన్నతమైన యశస్సు నార్జించాడు. అతడు గడించిన కీర్తి చాలా విలువైనదని క్షత్రియులు, బ్రాహ్మణులు చాలామంది అతడి దగ్గరికి వచ్చారు.

అప్పుడతడు దేవయానాన్ని అధిరోహించాడు. ఆ దేవయానము రజో రహితమైన శ్రేష్ఠమార్గంలో చరించేది. అతడు కోరికలను, బంధాలను వదిలివేసి బ్రహ్మలోకానికి చేరుకున్నాడు.

23. న నం జాతి నివారేసి
బ్రహ్మలోకూపపత్తియా
అజా।యకకులే జాతా
బ్రాహ్మణా మన్తబన్ధునో.

తే చ పాపేసు కమ్మేసు
అభిణ్హం ఉపదిస్సరే
దిట్ఠేవ ధమ్మే గారయ్హా
సమ్పరాయే చ దుగ్గతిం
న తే జాతి నివారేతి
దుగ్గచ్చా గరాహాయ వ

24. న జచ్చా వసలో హోతి
న జచ్చా హోతి బ్రాహ్మణో
కమ్మనా వసలో హోతి
కమ్మనా హోతి బ్రాహ్మణో.

ఏవం వుత్తే అగ్గిక భారద్వాజో బ్రాహ్మణో, భగవన్తం ఏతదవోచ; "అభిక్కన్తం భో గోతమ, అభిక్కన్తం భో గోతమ; సేయ్యథాపి భో గోతమ, నిక్కుజ్జితంవా ఉక్కుజ్జేయ్య పటిచ్ఛన్నం వా వివరేయ్య మూళ్హస్స వా మగ్గం ఆచిక్ఖేయ్య అంధకారే వా తేలపజ్జోతం ధారేయ్య చక్ఖుమన్తో రూపాని దక్ఖిన్తీతి ఏవమేవం భోతా గోతమేన అనేక పరియాయేన ధమ్మో పకాసితో. ఏసాహం భగవన్తం గోతమం సరనం గచ్ఛామి, ధమ్మఞ్చ, భిక్ఖుసంఘఞ్చ. ఉపాసకం మం భవం గోతమో ధారేతు అజ్జతగ్గే పాణూపేతం సరణం గతం'తి.

23. నిమ్నకులంలో పుట్టినంత మాత్రాన బ్రహ్మలోకపు జన్మ దుష్కరం కాదు. పండిత వంశంలో పుట్టిన బ్రాహ్మణులు మంత్రబంధువులు మాత్రమే.

వారు పాపకర్మలలో మగ్నులైనవారు. ఈ ప్రపంచంలోనే నిందనీయులైనారు. ఇక ఈ లోకం నుండి నిష్క్రమించాక వారు దుర్గతి పాలు కాక తప్పదు. ఇలాంటప్పుడు వారి ఉన్నతమైన పుట్టుక వారిని నిందనీయస్థితినుండి లేదా దుర్గతి నుండి కాపాడలేదు.

24. (కాబట్టి) పుట్టుకతో ఎవ్వడూ శూద్రుడు గాని బ్రాహ్మణుడు గాని కాజాలడు. తను చేసే పనులవల్ల మనిషి శూద్రుడుగా లేక బ్రాహ్మణుడుగా మారతాడు.

బుద్ధుడీ విధంగా చెప్పేసరికి ఆ అగ్గిక భారద్వాజ బ్రాహ్మణుడు బుద్ధుడితో ఇలా అన్నాడు. అత్యుత్తమం గౌతమా! అత్యుత్తమం! ఓ గౌతమా! తలక్రిందులైన పాత్రను మళ్ళీ సరిగ్గా పెట్టినట్లు, మూసుకున్న దాన్ని తెరచినట్లు, మార్గభ్రష్టుడైన వాడికి సరైన మార్గం చూపినట్లు, అంధకారంలో దీపపుకాంతులు విరజిమ్మినట్లు 'కళ్ళున్న వారు అసలైన రూపాన్ని చూద్దురు గాక' అన్నట్లు ఓ పూజ్య గౌతమా! ధర్మాన్ని మీరు వివిధ కోణాలనుండి వివరించారు. కాబట్టి నేను ఇదిగో గౌతమా! మిమ్మ శరణుజొచ్చుతున్నాను. దయచేసి గౌతములు నన్ను ఉపాసకునిగా అంగీకరింతురుగాక! నేనీ రోజు నుండి ఇక నా మరణ పర్యంతము మీ ఉపాసకుడిగా మారగలను.



భయంకర ప్రవృత్తి కలిగిన అంగుళమాలిని శాంత స్వభావంతో జయించిన ధీరుడు బుద్ధుడు.

# అంగుళిమాల పరిత్రాణము

**గర్భవతులైన తల్లులకు సులభ ప్రసవం జరగాలని, వారినాశీర్వదించే సమయంలో పఠించదగిన సుత్తము.**

కొన్ని బౌద్ధ దేశాలలో ఈ అంగుళిమాల సుత్తాన్ని గర్భవతులైన స్త్రీలు త్రాగే నీటిని అభిమంత్రించడానికి ఉపయోగిస్తారు. దానితో ఆమె సుఖంగా ప్రసవించగలుగుతుంది.

పూజ్య అంగుళిమాలుడు, భిక్షువయ్యాక రోజూలాగే ఆ రోజు కూడా తన దైనిక భిక్షాటన చేస్తూ ఒక గర్భవతి యైన స్త్రీ ఇంటికి చేరుకున్నాడు అక్కడ అతడికి గర్భవతి ప్రసవవేదనతో వేసే కేకలు వినిపించాయి. ఆ కేకలు విని అతడి హృదయం ద్రవించింది. ఏమి చేయాలో తోచని అంగుళిమాలుడు బుద్ధుడి వద్దకు పరుగున వెళ్ళి జరిగిన విషయాన్ని వివరించాడు.

అప్పుడు బుద్ధుడు అంగుళి మాలుడితో - మళ్ళీ అదే ఇంటికి వెళ్ళి ఈ పరిత్రాణగాథను పఠించమన్నాడు. అంగుళిమాలుడు బుద్ధుడు చెప్పినట్లే మళ్ళీ అదే ఇంటికి వెళ్ళి ఈ గాథను పఠించగా ఈ పరిత్రాణగాథా ప్రభావంతో ఆ ఇల్లాలు సుఖ ప్రసవం చేసింది. అప్పటి నుండి ఈ గాథ 'అంగుళి మాల పరిత్త'గా ప్రసిద్ధిగాంచింది.

## అఙ్గులి మాల పరిత్త

యతోహం భగిని
అరియాయ జాతియా జాతో
నాభి జానామి సఞ్చిచ్చ
పానం జీవితా వోరో పేతా
తేన సచ్చేన సొత్థి తే
హోతు సొత్థి గబ్భస్స.

# అంగులిమాల పరిత్రాణము

సోదరీ! ఈ అర్హతత్వమనే రెండో జన్మలో పుట్టిన నాటినుండి నాకు తెలిసి నేనే ప్రాణినీ హింసించలేదు. ఈ సత్య ప్రభావంతో నీకు క్షేమం కలుగుగాక. నీ గర్భంలో ఉన్న శిశువుకు కూడా క్షేమం కలుగు గాక.

# జయ పరిత్రాణము

రక్షణ, జయములకు ఈ జయ పరిత్త సుత్త పారాయణ మవసరము. ఈ సుత్తానువాదము గాథాపరంగా కాకుండా సారాంశరూపంలో అందించబడింది.

అర్హతుడు, సమ్యక్ సమ్బుద్ధుడు, మహిమాన్వితుడు అయ్యి, బలము, జ్ఞానము, తేజస్సు, జయము, సాఫల్యము, గొప్ప మానసిక శక్తి, అనేక సద్గుణములు, అనంత పుణ్యములు, కలిగి, సమస్త విపత్తులను పారద్రోలగల సమర్థుడైన ఆ బుద్ధుడికిదే నా వందనము.

మీ సర్వానారోగ్యాలు, బాధలు, ఆపదలు, దుఃఖాలు, ఆవేదనలు మరియు అశాంతి మాయమగు గాక. మీ కోరికలన్నీ తీరుగాక. మీరు చిరకాలం జీవింతురుగాక. ఆ మహానుభావుని ద్వాత్రింశత్ లక్షణాలు, ఎనభై మాధ్యమిక చిహ్నాలద్వారా మీకు దీర్ఘాయువు లభించుగాక. 108 మంగళప్రద చిహ్నాలు, ఆరు వర్ణముల కిరణాలు, అతడి వర్చస్సు (కేతుమాల), దశపారమితలు, పది ఉపపారమితలు, పది పరమార్థ పారమితలు, శీల- సమాధి - ప్రజ్ఞలు, జ్ఞేయ ధర్మాలు, ఏకాగ్రత, ధ్యానము, వంటి వాటి వల్ల మీకు శాంతి లభించు గాక.

సమ్యక్ సమ్బుద్ధుడైన బుద్ధుడి దయతో, అతడి ధర్మ సంఘాల అనుగ్రహంతో మీరు దీర్ఘాయుష్మంతులగుదురు గాక. పైన వివరించిన త్రిరత్నాలు తేజస్సుతో, మానసిక శక్తితో, సమ్యక్ విచారంతో నిండి ఉన్నవి. ఆ త్రిరత్నాల ప్రభావంతో, 84వేల ధార్మిక విషయాల ప్రభావంతో, తొమ్మిది లోకోత్తర ధర్మాల ప్రభావంతో

అష్టాంగ మార్గ ప్రభావంతో, అష్ట సమాపత్తుల ప్రభావంతో, ఆరు అభిజ్ఞల ప్రభావంతో; విశ్వాసము, దయ సౌహార్ద్రత, సమత్వము వంటి ముఖ్యమైన ముప్పై గుణాల ప్రభావంతో మీరు దీర్ఘాయుష్మంతులగుదురు గాక.

ఆకాశాన్ని, పర్వతాలను, అరణ్యాలను, భూమిని, సరస్సులను, నదులను, మహాసముద్రాలను రక్షించే దేవతలు మిమ్మల్ని కూడా రక్షించుగాక.

బుద్ధ, ధర్మ, సంఘములనే త్రిరత్నాల దయతో, 84వేల ధార్మిక విషయాల దయతో, త్రిపిటకముల దయతో, బుద్ధుడి శిష్యుల దయతో మీ సర్వానారోగ్యాలు, భయాలు, కష్టాలు, ఆపదలు, దుశ్శకునాలు, దురదృష్టాలు నశించుగాక.

మీరెల్లప్పుడూ ఆయుష్మంతులు, ధనవంతులు, శ్రేయోవంతులు, యశోవంతులు, బలవంతులు, వర్ణవంతులు, సుఖవంతులు అగుదురు గాక.

## జయపరిత్త

సిరి ధితిమతి తేజో
జయసిద్ధి మహిద్ధి మహాగుణం,
అపరిమిత పుఞ్ఞాధికారస్స
సబ్బన్తరాయ నివారణ సమత్థస్స
భగవతో అరహతో సమ్మాసమ్బుద్ధస్స

ద్వత్తిమ్స మహాపురిస
లక్ఖనాను భావేన
అసీత్యనుబ్య్యాఞ్జన
లక్ఖనానుభావేన
అట్ఠుత్తర సతమఙ్గల
లక్ఖనానుభావేన
ఛబ్బన్న - రంస్యానుభావేన
కేతు మాలానుభావేన
దస పారమితానుభావేన
దస ఉపపారమితానుభావేన
దస పరమత్థ
పారమితానుభావేన
సీల సమాధి పఞ్ఞానుభావేన
బుద్ధానుభావేన
ధమ్మానుభావేన

సంఘానుభావేన

తేజానుభావేన

ఇద్ధ్యానుభావేన

బలానుభావేన

ఞేయ్య ధమ్మానుభావేన

చతురసీతి సహస్స

ధమ్మ క్ఖన్ధానుభావేన

నవ లోకుత్తర ధమ్మానుభావేన

అట్ఠఙ్గిక మగ్గానుభావేన

అట్ఠ సమాపత్యానుభావేన

ఛలభిఞ్ఞానుభావేన.



మేత్తా కరుణా ముదితా

ఉపేక్ఖానుభావేన

సబ్బపారమితానుభావేన

రతన త్తయ సరనానుభావేన

తుయ్హం సబ్బరోగా సోక ఉపద్దవ

దుక్ఖ దోమనస్సుపాయాసా వినస్సన్తు

సబ్బ సఙ్కప్పా తుయ్హం సమిజ ఝన్తు

దీఘాయుకో హోతు

సతవస్స జీవేన

సమఙ్గికో హోతు సబ్బదా

ఆకాస - పబ్బత - వన - భూమి
తటాక - గంగా - మహా సముద్ద
ఆరక్ఖక దేవతా
సదా తుమ్హే అనురక్ఖన్తు.

✧✧✧

సబ్బ బుద్ధానుభావేన
సబ్బ ధమ్మానుభావేన
సబ్బసంఘానుభావేన
బుద్ధ రతనం
ధమ్మ రతనం
సంఘ రతనం
తిన్నం రతనానం ఆనుభావేన
చతురసీతి సహస్స
ధమ్మ క్ఖన్ధానుభావేన
పిటకత్తయానుభావేన
జిన సావకానుభావేన

✧✧✧

సబ్బే తే రోగా
సబ్బే తే భయా
సబ్బే తే అంతరాయా
సబ్బే తే ఉపద్దవా
సబ్బే తే దున్నిమిత్తా

సబ్బే తే అవమఙ్గలా వినస్సన్తు
ఆయు వద్ధకో
ధన వద్ధకో
సిరి వద్ధకో
యస వద్ధకో
బలవద్ధకో
వన్న వద్ధకో
సుఖ వద్ధకో హోతు సబ్బదా

దుక్ఖా రోగా భయా వేరా
సోకా నస్సన్తు సబ్బదా
అనేకా అన్తరాయాపి
వినస్సన్తు చ తేజసా

జయసిద్ధి ధనం లోభం
సొత్థి భాగ్యం సుఖం బలం
సిరియాయు చ వన్నో చ
భోగం వుద్ధి చ యసవా
సత వస్సా చ ఆయూ చ
జీవసిద్ధి భవన్తు మే.







ధ్యానం చిత్తశాంతిని కలిగించి బుద్ధిని జాగృత పరుస్తుంది.

# ధ్యాన వర్గము



బుద్ధుడికి నమస్కరించి అతడిని నిత్యమూ ప్రార్థించేవారే ధన్యజీవులు.

# ప్రార్థన

బౌద్ధంలో ధార్మికమైన కోరికను ప్రార్థన అంటారు. బుద్ధుడి అభిప్రాయానుసారంగా మానవుడి దృఢమైన కోరిక తప్పక ఫలితాన్నిస్తుంది. అందుకే స్థిరమైన నిర్ణయం, దృఢమైన కోరిక, ఈ రెండూ ఆడ, మగ ఎవరైనా సరే వారి కోరికను తీరుస్తాయి. ప్రార్థన కన్నా కోరిక ఏకాగ్రము, ధ్యానవిషయమునై అలరారుతుంది. వ్యక్తి లోని మామూలు అభిలాషే దృఢమైన కోరికలా పరిణమించవచ్చు. అది నైర్మల్యాన్ని కోరుకోవచ్చు. కాని బుద్ధి అంగీకరించనంతవరకు మనిషి మానసిక కార్యం మాత్రం ప్రారంభం కాదు. పుణ్యకర్మను చేసిన తరువాత తన, తన చుట్టూ ఉన్న వారి యోగక్షేమాలను కోరుకోవడం బౌద్ధుల ఆచారం. ఇలా వారు వారి ధార్మిక జీవితాన్నికొనసాగిస్తారు. ఈ విధంగా వారు ఉత్తమోత్తమ మైన పునర్జన్మకు కావలసిన ధర్మాలను నేర్పుతో సాధిస్తారు.

కాబట్టి కోరికను పెంచుకున్నవారు ఉన్నత జీవితాన్ని గడపగలుగుతారు. నిర్వాణ ప్రాప్తి వరకు వారీ విధమైన జీవితాన్ని గడపగలుగుతారు. ఇలాంటి కోరిక లేకపోతే మనిషికి నిర్వాణం కూడా సిద్ధించదు.

పత్థనా

1. ఇమినా పుఞ్ఞ కమ్మేన
మా మే బాలా సమాగమో
సతం సమాగమో హోతు
యావ నిబ్బాన పత్తియా

## ప్రార్థన

నేను సాధించిన ఈ పుణ్యకర్మల ప్రభావం చేత నాకు మూర్ఖులతో మైత్రి ఎన్నటికీ ఏర్పడకుండుగాక. నిర్వాణం ప్రాప్తించేంత వరకు నాకు మంచివారితో మాత్రమే మైత్రి కుదురుగాక.



జగద్వంద్యుడైన బుద్ధుడికి నమస్కరిస్తే సర్వ మంగళాలు సమకూరుతాయి.

# జయమంగళ గాథ

(ఐశ్వర్యాభివృద్ధికొరకు ఆశీర్వదిస్తూ కొన్ని ముఖ్యమైన సందర్భాలలో పఠించదగినది.)

బౌద్ధదేశాలలో వివాహ, గృహప్రవేశాది శుభకార్యాలు జరిపేటప్పుడు బౌద్ధులీ గాథలను పఠిస్తారు. ఈ గాథలను పిల్లలకు నేర్పి సంగీత వాద్యాల సహకారంతో అందంగా పాడించవచ్చు.

ఈ ఎనిమిది గాథలు బుద్ధుడు, అతడి శక్తిమంతులైన ప్రతిపక్షులకి మధ్యజరిగిన సంఘర్షణాత్మక సందర్భాలను గుర్తుకుతెస్తాయి. వారతన్ని చంపాలని, అవమానించాలని, జయించాలని ఎంతగానో ప్రయత్నించారు. వారిని బుద్ధుడు తన నైతిక ప్రవర్తనతో ఎలా ఎదుర్కొన్నాడో ఈ గాథలు మనకు వివరిస్తాయి. ఇందులో ప్రతీ గాథ వెనక ఒక అందమైన కథ దాగుంది. వాటన్నిటినీ ఈ చిన్ని పుస్తకంలో పొందుపరచడం సాధ్యంకాదు. బుద్ధుడు చూపిన ఉదాహరణలను అనుసరిస్తూ ఈ గాథలను భక్తి-శ్రద్ధలతో పఠించినవారు జీవితంలో చాలా కష్టాలనెదుర్కొన గలుగుతారు.

## జయమంగళ గాథా

1. బాహుం సహస్స మభి నిమ్మిత
సాయు ధన్తం
గిరి మేఖలం ఉదిత ఘోర
ససేనమారం
దానాది ధమ్మ విధినా
జితవా మునిన్దో
తం తేజసా భవతు మే*
జయ మంగళాని

2. మారాతిరేక మభి
యుజి ౹త సబ్బరత్తిం
ఘోరం పనా-లవక
మక్ఖ మథద్ధ యక్ఖం
ఖన్తి సుదన్త విధినా
జితవా మునిన్దో
తం తేజసా భవతు మే *
జయ మంగళాని

---

* ఇతరులకొరకు చదివేటప్పుడు 'మే'ని 'తే'గా చదవాలి.

## జయ మంగళ గాథ

శస్త్రములను ధరించి మారుడు తన వేయి చేతులతో ఘోరంగా గర్జిస్తూ వస్తున్న భయంకర గజం గిరిమేఖలపై కూర్చుని ఉన్నాడు. అలాంటి మారుడిని సైన్యంతో సహా దానాది ధార్మిక కృత్యాల ప్రభావంతో మునిశ్రేష్ఠుడైన బుద్ధుడు అవలీలగా జయించాడు. ఆ బుద్ధుడి దయతో నాకు మంగళ ప్రదమైన జయం కలుగుగాక.

మారుని కంటే భయంకరుడైన రాక్షసుడు అలవకుడు. ఇతడు బుద్ధుడితో ఒక రాత్రంతా యుద్ధం చేసాడు. అటువంటి క్రూర రాక్షసున్ని బుద్ధుడు శాంతి, క్షాంతుల ద్వారా జయించాడు. దీనిప్రభావంతో నాకు మంగళ ప్రదమైన జయం సిద్ధించుగాక.

3. నాలాగిరిం గజవరం
అతిమత్తభూతం
దావగ్గి చక్క మసనీవ
సుదారు నన్తం,
మేత్తమ్బు సేకవిధినా
జితవా మునిన్దో
తం తేజసా భవతు మే*
జయ మంగళాని.

4. ఉక్ఖిత్త ఖగ్గ మతిహత్థ
సుదారు నన్తం
ధావన్తి యోజన పథన్గులి
మాలవన్తం
ఇద్ధీభి సఙ్ఖత మనో
జితవా మునిన్దో
తం తేజసా భవతు మే*
జయ మంగళాని.

---

* ఇతరులకొరకు చదివేటప్పుడు 'మే'ని 'తే'గా చదవాలి.

3. అశనిపాతంలా, దావానలంలా, తనపైకి పరిగెత్తి వచ్చిన క్రూరమైన 'నాలాగిరి' అనే మదించిన గజరాజును మైత్రి అనే చన్నీటిని చిలకరించి బుద్ధుడు జయించాడు. దీని ప్రభావంతో నాకు మంగళప్రదమైన జయము సిద్ధించుగాక.

4. కత్తిని పైకెత్తి మూడు యోజనాల నుండి వేగంగా పైకి దుమికి వస్తున్న అంగుళిమాలిని బుద్ధుడు తన బుద్ధిబలాల నుపయోగించి శాంతంగా అతడి మనస్సును జయించాడు. దీని ప్రభావంతో నాకు మంగళప్రదమైన జయము సిద్ధించుగాక.

5. కత్వాన కట్ఠ ముదరం
ఇవ గబ్భినీయా
చిన్చాయ దుట్ఠవచనం
జనకాయ మజ్ఝే ।
సన్తేన సోమ విధినా
జితవా మునిన్దో
తం తేజసా భవతు మే*
జయ మంగళాని

6. సచ్చం విహాయ మతి సచ్చక
వాద కేతుం
వాదా-భిరోపిత మనం
అతి అన్ధ భూతం
పఞ్ఞా పదీప జలితో
జితవా మునిన్దో
తం తేజసా భవతు మే*
జయ మంగళాని

---

* ఇతరులకొరకు చదివేటప్పుడు 'మే'ని 'తే'గా చదవాలి.

5. తన గర్భం పెద్దగా కనిపించాలని ఆమె కడుపును కర్రలతో కట్టుకుంది. చించుడు కఠిన పదాలతో నిండు సభలో అసత్యనిందారోపణ చేశాడు. ఆమెను మునీంద్రుడైన బుద్ధుడు తన సహజమైన శాంతస్వభావంతో జయించాడు. ఆ ప్రభావంతో నాకు మంగళ ప్రదమైన జయము సిద్ధించుగాక.

6. గర్వితుడైన సచ్చకుడు నిజమును మరచి వివాదాలకు నెలవైనాడు. అతడు తన వాదబుద్ధితోనే గుడ్డివాడైనాడు. అటువంటి వాడి మదిలో ప్రజ్ఞా దీపాన్ని వెలిగించి బుద్ధుడతన్ని జయించాడు. ఆ ప్రభావంతో నాకు మంగళ ప్రదమైన జయము సిద్ధించుగాక.

7. నన్దోపనన్ద భుజగం
విబుధం మహిద్ధిం
పుత్తేన థేర భుజగేన
దయా పయన్తో
ఇద్ధూపదేశ విధినా
జితవా మునిన్దో
తం తేజనా భవతు మే *
జయ మంగళాని

8. దుగ్గాహ దిట్ఠి భుజగేన
సుదట్ఠ హత్థం బ్రహ్మాం విసుద్ధి జుతి
మిద్ధి బకాభిధానం
ఞానాగదేన విధినా
జితవా మునిన్దో
తం తేజసా భవతు మే*
జయ మంగళాని

9. ఏతాపి బుద్ధ
జయమంగళ అత్థగాథా
యో వాచకో దినదినే
సరతే మతన్ది
హిత్వాన నేక వివిధాని
చుపద్దవాని
మోక్ఖం సుఖం అధిగమేయ్యా
నరో సపఞ్ఞో

---

* ఇతరులకొరకు చదివేటప్పుడు 'మే'ని 'తే'గా చదవాలి.

7. మునీంద్రుడైన బుద్ధుడు తన బుద్ధిబలాలనుపయోగించి (మానసిక శక్తితో) తన పుత్రుడివంటి శిష్యుడైన స్థవిర మౌద్గల్యాయనుడి ద్వారా బుద్ధిశాలి, మరియు శక్తిమంతుడైన నన్దోపనన్దుడనే సర్పాన్ని జయించాడు. దీని ప్రభావంతో నాకు మంగళప్రదమైన జయము సిద్ధించుగాక.

8. మిథ్యాదృష్టిజాలమనే సర్పము తన హస్తమును కాటువేయగా పవిత్రము, ప్రకాశమానము అయిన బ్రహ్మాబకముయొక్క గాయమును మునీంద్రుడైన బుద్ధుడు తన జ్ఞానౌషధము చేత మాన్పినాడు. దీని ప్రభావంతో నాకు మంగళప్రదమైన జయము సిద్ధించుగాక.

9. బుద్ధుని జయమంగళ గాథలైన ఈఎనిమిదింటిని ఎవరైతే ప్రతిరోజు పఠించి జ్ఞప్తికుంచుకుంటారో, అటువంటి మహానుభావుడు ప్రపంచంలోని పలురకాలైన ఆపదలనుండి విముక్తిని పొంది నిర్వాణసుఖాన్ని అనుభవిస్తాడు.

# బుద్ధుడి ముందు ప్రాతఃసాయం పఠించదగిన గాథలు

ఈ భక్తిమయ గాథలను పఠించడం వల్ల మనస్సులో ప్రశాంతి జనించి మనపై మనకు విశ్వాసముదయిస్తుంది. వీటిని పఠించడానికి కేవలం కొద్దినిమిషాల సమయం చాలు. ఇందులోని పదాలను ప్రతీసారి వాడాల్సిన అవసరం లేదు. మీరు మీ పరిస్థితుల కనుగుణంగా కొత్తవాటిని వాడవచ్చు. సామూహిక కార్యక్రమాల్లో కూడా వీటిని పఠించవచ్చు. ధార్మికోపన్యాసం చివరన, బుద్ధపూజా సమయంలో వీటిని పఠించవచ్చు.

వీటిని చదివేముందు దురాలోచనలనన్నింటినీ వదిలిపెట్టాలి. మీ హృదయాన్ని ప్రశాంతపరచుకోవాలి. బుద్ధిని పవిత్రంగా మార్చుకోవాలి. మీరు చదివే ప్రతీ పదాన్ని క్షణక్షణమాగుతూ వాటిని ఆలోచిస్తూ ముందుకు సాగాలి. అలా అయితేనే అవి మీ హృదయ ద్వారాన్ని తడతాయి. మీకు తెలసిన వారెవరైనా కష్టాల్లో ఉంటే వారి వద్దకు మీ కరుణామయ విచారధారను పంపాలి. వారు కష్టాల నుండి బయట పడాలని మీరు మనస్ఫూర్తిగా కోరుకోవాలి.

ప్రభాత సమయంలోనే మీ మనస్సును సానుకూల పర్చుకొని శక్తివంతం చేసుకోవాలి. మిగతా రోజంతా సంతోషంగా ఉండడానికి మీ హృదయాన్ని సన్నద్ధపరచుకోవాలి. ఉదయం నుండి మీరు చేసిన పనుల గురించి ప్రతీరోజు సాయంత్రం ఆలోచించాలి. మంచిపనులు చేస్తే సంతోషపడండి. అలాగే మీరు చేసిన తప్పులు పునరావృత్తం కాకుండా చూసుకోండి. మీమనస్సును స్థిరంగా

ఉంచుకోవడానికి ప్రయత్నించండి. దాన్ని ఉన్నత స్థితిలో ఉంచాలి. సంతోషకరంగా ఉంచుకోవాలి. బుద్ధుడిని, అతడి ఆదర్శవంతమైన ప్రేమను, ఒక ధార్మిక లక్ష్యంగా స్వీకరించండి. మీ మీ కోరికలను తీర్చుకొనే ప్రతీసమయంలో ధర్మాన్ని విస్మరించకండి. దృఢమైన కార్యదీక్షతో తమను తాము ఉద్ధరించేకునే బుద్ధసంఘాన్ని మీ జీవితంలో ఒక ఉన్నతమైన ఆదర్శంగా ఉంచుకోవాలి.

పాళీభాష లోని ఈ దైనందిన పఠనములను విశ్వాసంతో, శ్రద్ధతో పఠించాలి. తెలుగులో పఠించదలిచినవారు ఈ గాథల తరువాత వచ్చే రెండు చిన్నచిన్న గాథలను వ్యాఖ్యానయుక్తంగా ఉదయమొకటి, సాయంత్రమొకటి పఠించాలి.

# సంఖిత్త పారాయణో

1. సబ్బే బుద్ధా బలప్పత్తా
పచ్చేకానం చ యం బలం
అరహంతానంచ తేజేన
రక్ఖం బంధామి సబ్బసో

2. సబ్బీతియో వివజ్జన్తు
సబ్బ రోగో వినస్సతు
మా మే భవత్వన్తరాయో
సుఖీ దీఘాయుకో భవ.

3. భవతు సబ్బ మంగలం
రక్ఖంతు సబ్బ దేవతా
సబ్బ బుద్ధాను భావేన
సదా సొత్థి భవన్తు మే *

---

* ఇతరులకొరకు చదివేటప్పుడు 'మే'ని 'తే'గా చదవాలి.

## సంక్షిప్త పారాయణము

## బుద్ధుడి ప్రతిమ ముందు కూర్చొని పఠించదగిన

సర్వవిధులైన బుద్ధుల, ప్రత్యేక బుద్ధుల, అర్హతుల శక్తివల్ల సర్వప్రకారములైన రక్షణ పొందెదనుగాక.

అన్నివిధాలైన దురదృష్టాలు సమసిపోనీ, అన్నిరోగాలు నశించనీ, ఏ విధమైన ఆపదా రాకుండుగాక, సుఖంగా, దీర్ఘాయువుతో జీవింతునుగాక.

నాకు సమస్త సన్మంగళాలు సంప్రాప్తించుగాక. సర్వదేవతలు నన్ను రక్షింతురుగాక. సర్వబుద్ధుల రక్షణ వల్ల ఎల్లప్పుడు క్షేమంగా ఉందునుగాక.

4. నక్ఖత్త యక్ఖ భూతానం
పాపగ్గహ నివారనా
పరిత్తస్సానుభావేన
హన్త్వా మయ్హం* ఉపద్దవే.

5. యం దున్నిమిత్తం అవమఙ్గలంచ
యో చా మనాపో సకునస్స సద్దో
పాపగ్గహో దుస్సుపినం అకన్తం
బుద్ధాను భావేన వినాసమేన్తు.

6. దుక్ఖప్పత్తా చ నిద్దుక్ఖా
భయప్పత్తా చ నిబ్భయా
సోకప్పత్తా చ నిస్సోకా
హోన్తు సబ్బేపి పానినో

7. దేవో వస్సతు కాలేన
సస్స సమ్పత్తి హేతు చ
ఫీతో భవతు లోకో చ
రాజా భవతు ధమ్మికో

* ఇతరులకొరకు చదివేటప్పుడు 'మయ్హం'ని 'తుయ్హం'గా చదవాలి.

4. ఈ పరిత్త సుత్త ప్రభావంతో నక్షత్ర, రాక్షస, క్షుద్రశక్తుల వల్ల సంభవించే సమస్త ఉపద్రవాల నుండి నేను ముక్తుడనౌదును గాక.

5. బుద్ధుని దివ్యశక్తి- ప్రభావాల వల్ల సర్వ దుశ్శకునాలు, ప్రతికూల పరిస్థితులు, పక్షుల శకున సూచక శబ్దాలు, పాపగ్రహ ప్రభావాలు. దుస్స్వప్నాలు అన్నీ నశించుగాక.

6. దుఃఖ తప్తులంతా దుఃఖ రహితలౌదురుగాక. భయ గ్రస్తులంతా భయ రహితులగుదురుగాక. శోక తప్తులు శోక రహితులగుదురు గాక.

7. సకాలంలో వర్షాలు కురియుగాక. పంటలు బాగా పండుగాక. ప్రపంచమంతా సుసమ్పన్నమగుగాక. రాజు ధర్మబుద్ధి గలవాడగు గాక.

# ప్రాతః కాలంలో పఠించదగినది

(బుద్ధుడిని మనస్సులో స్మరించుట)

## వందనము - శరణము

నమో బుద్ధాయ

నమో ధమ్మాయ

నమో సంఘాయ

జ్ఞాన కరుణా సంపన్నుడైన ముక్త పురుషుడు బుద్ధుడికి వందనము.

బుద్ధుడు ఉపదేశించిన ఆ ఉన్నతమైన ధర్మానికి వందనము.

అలాంటి ఉన్నతమైన ధర్మాన్ని రక్షించే పవిత్ర సంఘానికి వందనము.

ఈ త్రిరత్నాలను నేను శరణు జొచ్చు చున్నాను.

ఈ త్రిరత్నాలు నన్ను, నేను ప్రేమించే సమస్త మానవులనూ రక్షించుగాక. మాకే కష్ట, నష్టాలు సంభవించకుండుగాక. మా క్లేశాలన్నింటనీ మేము అధిగమించెదముగాక. మేమెల్లప్పుడు సఫలులమగుదుము గాక. మాకు మంచి ఆరోగ్యము, బలము, శాంతి, సౌఖ్యాలు ప్రాప్తించుగాక. మా తలిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు, గురువులు, మిత్రులు, బంధువులు సుఖ సంతోషాలతో జీవింతురుగాక. వారందరి కష్టనష్టాలు మాయమగుగాక. వారి ఆవేదనలు త్వరగా ఉపశమించుగాక. వారికి ఒక వేళ అనారోగ్యం సంభవిస్తే, త్వరగా కోలుకొని స్వస్థులగుదురుగాక. వారిని బుద్ధుడు, ధర్మము, సంఘము రక్షించుగాక.

# ధార్మికాభిలాష

1. బుద్ధుడు జీవితాంతం నా ఆలోచనలను, పనులను, పర్యవేక్షించు గాక.
2. నేను బలహీనపడినప్పుడు దృఢంగా మారేట్లు, ఆపదలొచ్చినప్పుడు ధైర్యంగా ఉండేట్లు, అదృష్టం మారుతున్న ప్రతీసారి శాంత స్వభావాన్ని వీడకుండా ఉండేట్లు ధర్మం నాకు సహాయ పడుగాక.
3. నేను ఇతరులతో వ్యవహరించేప్పుడు వారు శత్రువులైనా సరే నాలో మాత్రం వారిపై దయ, శాంతి, సామరస్యం నెలకొనేట్లుగా సంఘం నాకు ప్రేరణ నిచ్చు గాక.
4. నన్ను, నా కుటుంబాన్ని దేవతలు రక్షింతురు గాక.
5. నా దైనందిన జీవితంలో నాకు అర్హతులు, బోధి సత్త్వులు, సర్వదా మార్గ దర్శకులగుదురు గాక.
6. నా దేశం శాంతి, సౌభాగ్యాలతో విలసిల్లుగాక.
7. ఈ రోజు నా ప్రేమను ఇతరులకందించే అవకాశం రానీ, నేనీ జీవితాన్ని అనవసరమైన ఆనందాలతో, ఆతృతలతో వ్యర్థం చేయను. ప్రపంచంలో సుఖశాంతుల నభివృద్ధి పరచడానికే నా జీవితాన్ని ఉపయోగిస్తాను.
8. బుద్ధుడు నా మస్తకంలో, ధర్మం నా హృదయంలో, సంఘము నా ప్రక్కన; ఉండి నన్ను జీవితంలో ముందుకు నడుపుగాక.
9. ప్రపంచంలో సర్వమానవులు, నా శతృవులతో సహ శాంతితో బ్రతుకుదురు గాక.

నమో బుద్ధాయ

# సాయంకాలంలో పఠించదగినది

(బుద్ధుడిని మనస్సులో స్మరించుట)

## వందనము - శరణము

నమో బుద్ధాయ
నమో ధమ్మాయ
నమో సంఘాయ

జ్ఞాన, కరుణలతో సంపూర్ణ మానవుడైన ఆ ముక్త పురుషుడు బుద్ధుడికి వందనము.

బుద్ధుడు ఉపదేశించిన విశ్వసనీయమైన ఆ ఉత్తమ ధర్మానికి వందనము.

అటువంటి ఉత్తమ ధర్మాన్ని రక్షించే పవిత్ర సంఘానికి వందనము.

ఈ త్రిరత్నాలను నేను శరణు జొచ్చుచున్నాను.

ఈ త్రిరత్నాలు నన్ను, నా వాళ్లను రక్షించుగాక.

మేము కష్ట నష్టాలను, నానా విపత్తులను సులభంగా అధిగమించెదము గాక.

మేమెల్లప్పుడు సఫలులమగుదుము గాక.

మేము మంచి ఆరోగ్యంతో, బలంతో, సుఖశాంతులతో సర్వదా జీవించెదము గాక.

మా తల్లి దండ్రులు, అన్నదమ్ముల్లు, అక్కచెల్లెళ్ళు, గురువులు, మిత్రులు, బంధువులు క్షేమంగా ఉందురుగాక.

ఆపదలు, కష్టనష్టాలు, లేకుండా అన్ని విధములైన చింతలను వారు త్వరగా అధిగమించెదరుగాక.

వారికి ఒకవేళ అనారోగ్యం సంభవిస్తే వారు త్వరగా కోలుకొని ఆరోగ్యవంతులగుదురు గాక.

బుద్ధుడు, అతడి ధర్మము, సంఘము వారిని రక్షించుగాక.





హే బుద్ధ భగవాన్

ఈ రాత్రి నన్ను, నేను ప్రేమించే అందరినీ రక్షించు. మా కష్టాలను కడతేర్చు.

ఈ రాత్రి మాకు ప్రశాంతమైన నిద్ర పట్టి, రేపటి ఉదయాన ఉత్సాహవంతమైన మనో-దేహాలతో మేల్కొందుము గాక.

## ధార్మికాభిలాష

నేనొక వేళ సన్మార్గం నుండి పైదొలిగితే, ఏ దోషం చేయడం ద్వారా అలా జరిగిందో బాగా తెలుసుకొని, మళ్ళీ ఆ దోషాన్ని చేయకుందును గాక.

నేనెవరినైనా అజాగ్రత్తతో వాచా, కర్మణా బాధపెడితే మరోసారి అలా జరక్కుండా జాగ్రత్త పడతాను.

హే బుద్ధభగవాన్, పరమజ్ఞానీ !

నా హృదయాన్ని చక్కదిద్దుకొనేందుకు నాకొక అవకాశమిచ్చి నాకు సహాయం చేయి తండ్రీ!

నేను చేసే ప్రతీ పనిలోనూ ప్రేమ, కరుణ వంటి ఉదాత్త భావనలు ప్రతిబింబించనీ!



ఈర్ష్యాసూయల బారి నుండి నా హృదయాన్ని రక్షించుకొని, దాన్ని పరిశుద్ధ పరచుకొనేందుకు నేను సర్వదా ప్రయత్నిస్తాను. అందరితో కలిసి బ్రతకడానికి ప్రయత్నిస్తాను.

నేను క్షేమంగా ఉన్నా, కష్టాల్లో ఉన్నా సద్ధర్మాన్ని పాటించడానికి ప్రయత్నిస్తాను.

ఒకనాడు ..... ఈ ప్రపంచాన్నొదిలి వేసే సమయం అసన్న మౌతుందని నాకు బాగా తెలుసు. అప్పుడు నేనేమాత్రం భయ భ్రాంతులకు లోనుగాకుండా దేహాన్ని విసర్జిస్తాను. ఆ విషయం గురించి ఇప్పటినుండే చింతించి, బాధ పడను. మరణం ఒకరకంగా నాకానందాన్నే ఇస్తుంది. ఎందుకంటే నేనీ ప్రపంచంలోకి వచ్చిన నాటి కన్నా ఇప్పుడు ఎక్కువ గుణవంతుడిగా మారి ఈ ప్రపంచాన్ని వదిలి పెడతాను.

ఇతరులు నా పట్ల ఏదైనా తప్పు చేస్తే నేను వారిని దయాభావంతో క్షమింతునుగాక. నా హృదయంలో వారిపై ఏమాత్రం ద్వేషం ఉండకుండు గాక. నాకెవరైనా చిన్న మేలు చేసినా సరే, దాన్ని ఎల్లప్పుడూ జ్ఞాపకముంచు కొని వారి పట్ల కృతజ్ఞతాభావం పెంపొందించు కుందును గాక.

నా జీవితం నన్ను ప్రేమించే వారికి, నేను ప్రేమించే వారికి అందరికీ సంతోషాన్ని పంచిపెట్టాలి.

నమో బుద్ధాయ



# బుద్ధానుస్మృతి

బుద్ధుడిని ధ్యానించడం ద్వారా ఆంతరిక శాంతి, విశ్వాసం రెండూ లభిస్తాయి. బుద్ధుడు దశపారమితలు కలిగినవాడు. అతడు జన్మ జన్మలలో శ్రమించి వాటిని పొంది మోక్ష పర్యంతం వాటిని సాధన చేసినవాడు. పారమితలలో దానము, శీలము, నైష్కర్మ్యము, ప్రజ్ఞ, వీర్యము, క్షాంతి, సత్యము, అధిష్ఠానము, మైత్రి ఉపేక్షలు అనే ఈ పది ఉన్నాయి.

ఒక ఆదర్శోపాధ్యాయుడిలా బుద్ధుడు దుఃఖార్తులైన సర్వ ప్రాణులపై తన అనంతమైన కరుణను ప్రసరింప జేశాడు. వారి కలుషితమైన బుద్ధులనన్నింటినీ సరిజేసి వారికి నిర్వాణాన్ని ప్రసాదించాడు.

ఆర్య అష్టాంగిక మార్గాన్ని అనుసరించి పవిత్రాంతరంగులైన వారిని సులభంగా గుర్తించవచ్చు. వారు ఏ ధర్మానికి చెందినవారైనా సరే. వారిని ప్రతీవారూ గౌరవించాలని బుద్ధుడు చెప్పాడు. మనస్సు సమస్త విశ్వాన్ని నడిపించే ఒక శక్తి. ఈ విషయాన్ని తెలుసుకొన్నప్రతిమనిషి తన మానవీయ ప్రయత్నంతో పవిత్ర మైన జీవితాన్ని కొనసాగించవచ్చని, అలాంటి జీవితాన్ని మహాత్ముల ప్రేరణద్వారా గాని, వ్యక్తిగత ప్రయత్నంతోగాని సాధించవచ్చని బుద్ధుడు ప్రవచించాడు.

సర్వ శీల సంపదకి ప్రతిరూపమైన బుద్ధుడు ప్రతీమానవులను తరింపజేసే పూర్ణతకి ప్రతీక. అందుకే బుద్ధుడిని స్మరిస్తే చాలు మానవులు అనూహ్యమైన లాభాలను పొందగలుగుతారు. బుద్ధుడి సద్గుణ సంపదపై మనస్సు కేంద్రీకరిస్తే బాధలు, ఆవేదనలు, మృత్యు భయాలవంటి సమస్త మానసిక భయాందోళనలు అంతరిస్తాయి.

## బుద్ధానుస్సతి

1. బుద్ధానుస్సతి మేత్తా చ
అసుభం మరణస్సతి
ఇతి ఇమా చతురారక్ఖా
భిక్ఖూ భావేయ్య సీలవా.

2. అనన్త విత్థార గుణం
గుణతోనుస్సరం మునిం
భావేయ్య బుద్ధిమా భిక్ఖూ
బుద్ధానుస్సతి మాదితో.

3. సవాసనే కిలేసేసో
ఏకో సబ్బే నిఘాతియ
అహూసు సుద్ధ సన్తానో
పూజానం చ సదారహో

4. సబ్బకాలగతే ధమ్మే
సబ్బే సమ్మా సయం ముని
సబ్బాకారేన బుజి ఝత్వా
ఏకో సబ్బఞ్ఞుతం గతో

5. విపస్సనాది విజ్జాహి
సీలాది చరనేహి చ
సుసమిద్ధేహి సమ్పన్నో
గగనాభేహి నాయకో.

# బుద్ధానుస్మృతి

(బుద్ధుడిని ధ్యానించుట)

1. శీలవంతుడైన భిక్షువు ఈ క్రింది నాలుగు విషయాలను సాధన చేయాలి. అవి; 1. బుద్ధుడిని ధ్యానించడం, 2. మైత్రిని ధ్యానించడం, 3. ప్రాపంచిక విషయాల జుగుప్సాకర ధర్మమును తెలుసుకోవడం. 4. అమంగళకరమైన మరణమును గుర్తించడం.

2. జ్ఞానియైన భిక్షువు బుద్ధుడి అనంత గుణగణాలను. ఆ గుణ గణాలు కలిగిన బుద్ధుడిని ధ్యానించాలి.

3. సర్వక్లేశాలను బుద్ధుడొక్కడే నాశనం చేయగల సమర్థుడు. అత్యంత పవిత్రమైన మనసును కలిగిన ఆ బుద్ధుడే అన్ని పూజలనూ అందుకోవడానికి అర్హుడు.

4. అన్ని వేళలలోనూ సుయోగ్యమైన ధర్మాన్ని అన్ని కోణాలనుండి స్వయంగా అర్థంచేసుకొని బుద్ధముని తానొక్కడే సర్వజ్ఞతను సాధించాడు.

5. ఆకాశమంత విశాలమైన విపశ్యనాది విజ్ఞానంతో కూడుకొని, శీలాది చరణ సమ్పన్నుడైన బుద్ధుడు నాయకుడై వెలుగొందుతున్నాడు.

6. సమ్మాగతో సుబ్బం రానం
అమోఘ వచనో చ సో
తివిధస్సాపి లోకస్స
ఞాతా నిరవసేసతో

7. అనేకేహి గునోఘేహి
సబ్బ సత్తుత్తమో అహు
అనేకేహి ఉపాయేహి
నరదమ్మే దమేసి చ.

8. ఏకో సబ్బస్స లోకస్స
సబ్బసత్తానుసాసకో
భాగ్య ఇస్సరియా దీనం
గుణానం పరమో నిధి

9. పఞ్ఞాస్స సబ్బ ధమ్మేసు
కరుణా సబ్బ జన్తుసు
అత్తట్ఠానం పరట్ఠానం
నాధికా గుణ జేట్ఠికా

10. దయాయ పారమి చిత్వా
పఞ్ఞాయత్తాన ముద్ధరి
ఉద్ధరి సబ్బధమ్మే చ
దయాయఞ్ఞే చ ఉద్ధరి.

11. దిస్స మానోపి తావస్స
రూపకాయో అచిన్తియో
అసాధారణ ఞానద్ధే
ధమ్మకాయే కథావకాతి.

6. బుద్ధుడు పరమానంద స్థితికి చేరుకున్నాడు. ఉన్నతమైన అతడి ఉపదేశాలు ఎన్నటికీ వ్యర్థం కాజాలవు. అతడికి ముల్లోకాల గురించి పూర్తిగా తెలుసు.

7. అనేక సద్గుణములతో బుద్ధుడు సర్వోత్తమ స్థితికి చేరుకున్నాడు. అనేక ఉపాయములతో దమనీయమైన వాటిని దమించాడు.

8. సమస్త లోకంలో సర్వమానవులను శాసించగల ఆచార్యుడు బుద్ధుడొక్కడే. అదృష్టములకు, ఐశ్వర్యములకు అతడు ఉత్తమ మైన నిధి వంటివాడు.

9. బుద్ధుడికి సకల ధర్మములందు ప్రవేశమున్నది. సమస్త ప్రాణులయందు అతడికి దయాభావమున్నది. ఈ విధంగా బుద్ధుడు తనకే కాకుండా సకల ప్రాణులకు లాభకారకుడు. అన్ని గుణాలలో కూడా అతడే ఉన్నతుడు.

10. బుద్ధుడు దయార్ద్ర హృదయంతో, ప్రజ్ఞతో ఉన్నత శిఖరాల నందుకొని తనను తాను ఉద్ధరించుకోవడమే కాక, సర్వ ధర్మాలను, సమస్త మానవులనూ ఉద్ధరించాడు.

11. ఒక మనిషిని చూసినట్లుగా భౌతిక శరీరంతో ప్రత్యక్షంగా బుద్ధుడిని చూడడం అసంభవం. ఇక అసాధారణ జ్ఞాన సంపన్నమైన అతడి ధర్మకాయాన్ని చూడడం సంభవమా?



ధర్మం బుద్ధుడితో సమానమైనది. అది ప్రకృతిని సమతులంగా ఉంచుతుంది.

# ధర్మానుస్మృతి

ధర్మము మానసిక శాంతిని కలగజేస్తుంది. మనిషిని కార్యోన్ముఖున్ని చేసేది ధర్మం. బుద్ధుడు ఉపదేశించిన ధర్మము సార్వకాలిక మైనది. సార్వదేశికమైనది. అది ఎందరో ప్రాణులను దుఃఖవిముక్తుల్ని చేసింది. చేస్తున్నది కూడా. అనింద్యమైన ఈ ధర్మము మానవులను ఉన్నత స్థితికి తీసుకెళ్లగలుగుతుంది. భౌతిక విషయాలన్నీ అనిత్యమైనవనే జ్ఞానాన్ని కలిగింపజేసి మనిషిని పరమోత్కృష్టమైన నిర్వాణధామం వైపు నడిపించేదే ధర్మము.

ధర్మాచరణ వల్ల మనిషికి అతి త్వరగా శాంతి లభిస్తుంది. దానికంటే ముందు ఆత్మ విమర్శ ఉదయిస్తుంది. ఆత్మ విమర్శ వలన మనిషి నడవడికలో మార్పు వస్తుంది. ఆ మార్పు శాశ్వతానందానికి సోపానం వేస్తుంది. ఉదాహరణకి 'మైత్రి'ని జీవితంలో అభ్యసించేవారికి కోపం వెంబడే నశిస్తుంది. తద్వారా మనిషికి సుఖం లభిస్తుంది.

తర్కము, వాదవివాదాలు మానవజీవితంలోని సత్యాన్ని తేల్చి చూపలేవు. ఇతరులను సర్వదా విమర్శించే వారికి సుఖం కరువౌతుంది. దాని బదులు మనిషి తనవైపు ఒకసారి తిరిగి చూసుకుంటే అతడికి ఎన్నో నిజాలు తెలుస్తాయి. ఇది ధర్మాచరణ ద్వారానే సాధ్యం. మిగతావారిలా బుద్ధుడు తను చెప్పింది ఏకారణం లేకుండానే నమ్మమమని చెప్పలేదు. తను వివరించిన ధర్మాన్ని పరీక్షించి, ఒకవేళ నచ్చితే స్వీకరించమన్నాడు. లేదా వదలి పెట్టమన్నాడు. అందుకే ఇది మహత్తరమైనది. అందరికీ ఆచరణ యోగ్యమైనది.

## ధమ్మానుస్సతి

స్వాక్ఖాతో భగవతా ధమ్మో
సన్దిట్ఠికో అకాలికో
ఏహిపస్సికో ఓపనయికో
పచ్చత్తం వేదితబ్బో విఞ్ఞూహీతి.

## ధర్మానుస్మృతి

(ధర్మమును ధ్యానించుట)

బుద్ధుడు అతి సులభంగా మహత్తరమైన ధర్మాన్ని బోధించాడు.

దీన్ని అందరూ పరీక్షించిమరీ పాటించవచ్చు. ఈ ధర్మం తక్షణమే ఫలితాన్నందిస్తుంది.

ఆంతరిక దృష్టి కలిగి ఉండాలని బోధించి అందరినీ ధార్మిక జీవనంవైపుకు ఆహ్వానించేది. నిర్వాణం వైపుకి తీసుకెళ్ళేది.

విజ్ఞులైన వారు వారి అభ్యుదయం కొరకు ఈ ధర్మంలోని ప్రతీ అంశాన్ని బాగా అర్థం చేసుకోవాలి.



తాము జ్ఞానాన్నార్జించి ఇతరులకు పంచే భిక్షు సంఘము సర్వదా వందనీయము.

# సంఘానుస్మృతి

బుద్ధుడు రూపొందించిన పవిత్ర భిక్షుసముదాయమే సంఘము. ఈ సంఘంలో ఉన్నత జీవనాన్ని కొనసాగించే బుద్ధుని శిష్యులుంటారు. వీరు ప్రపంచం అశాశ్వతమైనదని గ్రహించి, గృహపరిత్యాగం చేసి శాశ్వత నిర్వాణపథంవైపు పయనించేవారు. అంతమాత్రాన వీరు లోకాన్ని, లోకంలోని ప్రాణులను పట్టించుకొనరని కాదు. సర్వభూత దయ వారి ప్రాథమికగుణం. ప్రాణులను మనసా, వాచా, కర్మణా హింసించనివారు, బ్రహ్మచర్యాన్ని పాటించేవారు, బుద్ధుని ప్రియశిష్యులు. వీరి సముదాయమే సంఘం. ఈ సంఘం సమాజంలోని కాలుష్యాన్ని దూరం చేయగలిగేది. పరులహితమే దీని ప్రధానలక్ష్యం. దుఃఖార్తుల బాధలను రూపుమాపి వారికి పరమ సుఖస్వరూపమైన నిర్వాణపథాన్ని చూపడమే వీరి నిరంతర చర్య. బౌద్ధ సంఘంలో భిక్షువులు, భిక్షుణిలు కూడా ఉంటారు. వీరంతా తమ శీల, సమాధి, ప్రజ్ఞలను పెంపొందించుకుంటూ పవిత్రమైన జీవితాన్ని గడుపుతారు.

నిత్యమూ పుణ్యకర్మలు చేస్తారు కాబట్టి వీరు గౌరవనీయులు. వారికి దక్షిణలు సమర్పించవచ్చు. వారికి సరైన ఆతిథ్యమివ్వాలి. ఎదురుపడితే నమస్కరించాలి. వారి అవసరాలను తీర్చడం కూడా ధార్మిక కృత్యమే. ఇట్టి ధార్మిక కృత్యాల వలన పుణ్య సంచయం జరుగుతుంది. అది నిర్వాణ మార్గాన్ని సుగమం చేస్తుంది.

## సంఘానుస్సతి

సుపటిపన్నో భగవతో సావకసంఘో,

ఉజుపటిపన్నో భగవతో సావక సంఘో

ఞాయపటిపన్నో భగవతో సావక సంఘో

సామీచి పటిపన్నో భగవతో సావక సంఘో

యదిదం చత్తారి పురిసయుగాని

అట్ఠ పురిస పుగ్గలా

ఏస భగవతో సావక సంఘో

ఆహునేయ్యో పాహునేయ్యో

దక్ఖినేయ్యో అంజలి కరనీయో

అనుత్తరం పుఞ్ఞక్ఖేత్తం లోకస్సా'తి

## సంఘాను స్మృతి

(సంఘమును ధ్యానించుట)

బుద్ధుడి శ్రావక సంఘము సన్మార్గంలో ప్రతిష్ఠితమైనది.

బుద్ధుడి శ్రావక సంఘము ఋజుమార్గంలో ప్రతిష్ఠితమైనది.

బుద్ధుడి శ్రావక సంఘము న్యాయమార్గంలో ప్రతిష్ఠితమైనది.

బుద్ధుడి శ్రావక సంఘము ఉచితమైన మార్గంలో ప్రతిష్ఠితమైనది.

నాలుగు పురుషయుగ్మములు, ఎనిమిది విధముల ధార్మిక పురుష పుద్గలములు కలది.

బుద్ధుడి ఈ శ్రావక సంఘము సమర్పణలకి, ఆతిధ్యమునకు యోగ్యమైనది.

దక్షిణలు సమర్పించుటకు ఉచితమైనది. నమస్కరించదగినది.

ఈ లోకంలో నిరుపమానమైన పుణ్యక్షేత్రమిదే.

# మైత్ర్యనుస్మృతి

(మైత్రిపై ధ్యానము)

వ్యక్తి మనస్సు శాంతిమంతమైనప్పుడే ప్రపంచంలో శాంతి సాధ్యమౌతుంది. మైత్రీభావనతో స్పందించే హృదయం ఉంటే సర్వమానవులు సంతోషంగా జీవించగలుగుతారు.

మెత్త (మైత్రి) ని ధ్యాన విషయకమైన ధ్యేయవస్తువుగా స్వీకరించవచ్చు. సుందరమైన ఈ మానసికస్థితి మనిషిని దురాలోచనల నుండి, కోపం నుండి మిగతా అసంపూర్ణ మానసిక స్థితులనుండి రక్షిస్తుంది.

భేద భావాన్ని సమూలంగా నాశనం చేసి అందరిలో సంతోషాన్ని, దానగుణాన్ని పెంపొందించే ఈ మైత్రిని ఒక ఉన్నతమైన మానసిక స్థితిగా గుర్తించాలి. మనుష్యులు, మనుష్యేతరులు, తెలిసినవారు, తెలియని వారు, కనిపించేది, కనిపించనిది అనే ఈ భేదభావం మైత్రి వల్ల నశిస్తుంది. మైత్రిని బాగా ధ్యానించడం వల్ల ఏలాంటి దురాలోచన కూడా మన మనస్సులోనికి ప్రవేశించలేదు. ఇది ఒక ఉత్కృష్టమైన మానసిక స్థితి.

మైత్రీసాధన ద్వారా వ్యక్తి తనకు తాను చేరువౌతాడు. దీన్ని ఆత్మాసక్తి అనుకోకూడదు. దీన్ని కేవలం స్వీయ మానసిక ప్రశాంతిగా గుర్తించాలి. పూర్తిగా విషపూరితమైన మనస్సు ఇతరులపై నిజమైన ప్రేమను అభివ్యక్తీకరించలేదన్నది మనకు తెలిసిన విషయమే.

మైత్రిని ధ్యానించేముందు మైత్రీభావం వల్ల వచ్చే లాభాలను, తద్వ్యతిరేకమైన క్రోధభావం వల్ల వచ్చే నష్టాలను ఒకసారి స్మరించడం చాలా మంచిది.

తరువాత జాగృతమైన మైత్రీభావనతో ఈక్రింది వాక్యాలను మనస్సులో పఠిస్తూ ధ్యానం ప్రారంభించాలి.

★ *హాని, ప్రమాదాలు కలగకుండు గాక.*
★ *మానసిక వత్తిడులు మాయమగు గాక.*
★ *శారీకర బాధలు ఉపశమించుగాక.*
★ *సుఖ సంతోషాలతో జీవింతును గాక*

మనస్సులోకి ఈ వాక్యాలు ప్రవేశించి అందులో నాటుకొని పోయి క్రమంగా మనస్సు ఏకాగ్రయ్యేంత వరకు ఈ వాక్యాలనావృత్తం చేయాలి. చిత్తము శాంతించి ప్రసన్నమయ్యేంత వరకు వీటిని పఠించాలి.

అటు తరువాత మన మనుభవించిన ఆనందాన్ని ఇతరులకు సైతం అందించగలుగుతాము. మొదట మనకు మంచి అభిప్రాయం గల ఒక వ్యక్తి నెన్నుకోవాలి. అతడు, తండ్రి, తల్లి, గురువు, బంధువు, మిత్రుడు; వీరిలో ఎవరైనా కావచ్చు. కాని వారు సలింగులై ఉండాలి. అతడి / ఆమె సద్గుణాలను మొదట స్మరించాలి. స్మరిస్తూ ఇలా భావించాలి.

★ *అతడికి / ఆమెకు హాని, ప్రమాదాలు సంభవించకుండునుగాక.*
★ *అతడికి / ఆమెకు మానసిక వత్తిడులు మాయమగు గాక.*
★ *అతడికి / ఆమెకు శారీరిక రుగ్మతలు ఉపశమించుగాక.*
★ *అతడు / ఆమెది క్షేమంగా, ఆనందంగా జీవింతురు గాక.*

క్రొత్తవారు ఈ క్రింది నాలుగు రకాలైన వ్యక్తులనెన్నుకోకపోవడం మంచిది.

1. చాలా సన్నిహితులైన వారు.
2. చనిపోయిన వారు.
3. విలింగులు
4. శత్రువులు

నిరంతరాభ్యాసంతో మైత్రీ - ఏకాగ్రతలు స్థిరపడిన తరువాత ఇతరులకు సైతం మైత్రినందించగలుగుతాము.

అప్పుడు ప్రియమిత్రుడు, తటస్థుడు, అసమాహిత చిత్తుడు, శతృవు వంటి వారికి కూడా మైత్రి నందించ వచ్చు.

మైత్రి విశ్వజనీనమైనది, సర్వప్రియమైనది కూడా. దీనికి ఒక మతం, ఒక జాతి, అంటూ లేదు. బౌద్ధులు, బౌద్ధేతరులు ఇరువురూ మైత్రిని పాటించవచ్చు. తద్వారా సత్ఫలితాలను పొందనూ వచ్చు.

బుద్ధుడి అభిప్రాయానుసారంగా ఈ మైత్రీధ్యానాన్ని అనునిత్యం ఆచరించేవారు ఈ క్రింద పేర్కొన్నట్లు సత్వర ఫలితాలను పొందుతారు.

*1. హాయిగా నిద్రించ గలుగుతారు.*

*2. ప్రశాంతంగా నిద్రనుండి మేల్కొంటారు.*

*3. పీడకలలు రావు.*

*4. ఇతరులను సంతోషపెట్టగలుగుతారు.*

*5. దుష్టశక్తుల బారినుండి విముక్తులౌతారు.*

*6. దేవతలు వారిని రక్షిస్తారు.*

*7. అగ్ని, విష, శస్త్రాస్త్రాలు వారినేమీ చేయలేవు.*

*8. త్వరగా ఏకాగ్రత సిద్ధిస్తుంది.*

*9. చూడటానికి ఆహ్లాదకరంగా ఉంటారు.*

*10. అసంభ్రాంతమైన మనస్సుతో మరణిస్తారు.*

*11. ఒకవేళ ఈ జన్మలో అర్హతత్వం లభించపోతే, వచ్చే జన్మలోనైనా బ్రహ్మలోకంలో పుడతారు. అప్పుడు వారికది సులభంగా సిద్ధిస్తుంది.*

## మెత్తానుస్సతి

1. అత్తుపమాయ సబ్బేసం
సత్తానం సుఖకామతం
పస్సిత్వా కమతో మెత్తం,
సబ్బ సత్తేసు భావయే.

2. సుఖీ భవేయ్యం నిద్దుక్ఖో
అహం నిచ్చం అహం వియ
హితా చ మే సుఖీ హోన్తు
మజ్ఝత్తా థ చ వేరినో.

3. ఇమమ్హి గామక్ఖేత్తమ్హి
సత్తా హోన్తు సుఖీ సదా
తతో పరం చ రజ్జేసు
చక్కవాలేసు జన్తునో

4. సమన్తా చక్కవాలేసు
సత్తానం తేసు పానినో
సుఖినో పుగ్గలా భూతా
అత్తభావ గతా సియుం

5. తథా ఇత్థి పుమా చేవ
అరియా అనరియా పి చ
దేవా నరా అపాయత్థా
తథా దస దిసాసు చాతి.

# మైత్ర్యనుస్మృతి

1. తనను ఇతరులతో పోల్చుకొని, సర్వప్రాణులు తనలా సుఖాన్ని కోరుకుంటాయని తెలుసుకోవాలి. మనిషి సర్వప్రాణుల పట్ల మైత్రీ భావనను ప్రదర్శించాలి.

2. సర్వ దుఃఖాలు పోయి నాకు సుఖములభించు గాక. నా హితాన్ని కోరుకునే వారు, నా పట్ల తటస్థంగా ఉండేవారు, నన్ను ద్వేషించేవారు వీరంతా సుఖంగా ఉందురుగాక.

3. ఈ గ్రామ పరిసరాలలో నివసించే వారు, ఈ లోక చక్రవాళములలోని ఇతర రాజ్యాలలో నివసించేవారు అంతా సుఖంగా ఉందురుగాక.

4. సర్వ ప్రపంచ చక్రవాళములలో నివసించే ప్రాణులు సుఖంగా ఉండి పరమోత్తమమైన ఆనందానుభూతిని అనుభవింతురు గాక.

5. అదే విధంగా స్త్రీలు, పురుషులు, శ్రేష్ఠులు, సామాన్యులు, దేవతలు, మనుష్యులు, దీనులు, దశదిశలలో ఉన్నవారు; వీరంతా సుఖంగా ఉందురు గాక.

## మరనానుస్సతి

1. పవాత దీపతుల్యాయ
సాయు సన్తతి యాక్ఖయం
పరూపమాయ సమ్పస్సం
భావయే మరనస్సతిం

2. మహా సమ్పత్తి సమ్పత్తా
యథా సత్తా మతా ఇధ
తథా అహం మరిస్సామి
మరనం మమ హేస్సతి

3. ఉప్పత్తియా సహేవేనం
మరనం ఆగతం సదా
మారనత్థాయ ఓకాసం
వధకో వియ ఏసతి.

4. ఈసకం అనివత్తం తం
సతతం గమనుస్సుకం
జీవితం ఉదయా అత్థం
సురియో వియ ధావతి.

5. విజ్జు బుబ్బుల ఉస్సావ
జలరాజి పరిక్ఖయం
ఘాతకోవ రిపూ తస్స
సబ్బత్థాపి అవారియో.

# మరణానుస్మృతి

(మరణంపై ధ్యానం)

1. గాలిలో పెట్టిన దీపం లాంటిదీ జీవితం. ఇతరుల మరణాన్ని తమ జ్ఞాన చక్షువుతో చూసి మరణాన్ని సతతం స్మరించాలి.

2. ఈ ప్రపంచంలో గొప్ప గొప్ప సుఖాలననుభవించినవారు కూడా మరణించక తప్పదు. అదే విధంగా నేనూ మరణిస్తాను .... అవును .... నేను కూడా మరణిస్తాను.

3. పుట్టుకతోనే మరణం వస్తుంది. కాబట్టి ప్రాణులను వధించే హంతకుడిలా మరణం అవకాశం కొరకు ఎదురుచూసి, అవకాశం రాగానే మనిషిని కబళించి వేస్తుంది.

4. ఉదయించిన సూర్యుడు అస్తమించడానికి పరుగులు తీసినట్లు జీవితం ఒక్కనిమిషం కూడా ఆగకుండా ఎల్లప్పుడూ ఎంతో ఉత్కంఠతో మునుముందుకు పరుగెడుతుంది.

5. ఆకాశంలోని మెరుపుతీగలా, నీటిబుడగలా, తామరాకుపైని జలబిందువులా జీవితం క్షణికమైనది. ఇది ఏ క్షణాన రాలిపోతుందో తెలియదు. ఈ జీవితానికి శత్రువైన మరణమేమో హంతకుడి వంటిది. సర్వత్రా అనివార్యమైనది.

6. సుయసత్థామ పుక్షిద్ధి
బుద్ధి వుద్ధే జినద్వయం
ఘాతేసి మరనం ఖిప్పం
తా తు మాదిసకే కథా.

7. పచ్చయానం చ వేకల్యా
బాహి రజ ¦త్తుపద్దవా
దురామోదం నిమేసాపి
మరమానో అనుక్ఖనం' తి.

## అసుభానుస్సతి

1. అవిఞ్ఞానా సుభనిభం
సవిఞ్ఞానా సుభం ఇమం
కాయం అసుభతో పస్సం
అసుభం బావయే యతి.

2. వన్న సన్థాన గన్ధేహి
ఆసయో కాసతో తథా
పటిక్కులాని కాయా మే
కునపాని ద్వేసోలస.

3. పతితతమ్హా పి కునపా
జెగుచ్ఛం కాయ నిస్సితం
అధరో హి సుచి తస్స
కాయో తు కునపే ఠితం.

6. గొప్పమహిమాన్వితులు, తేజోవంతులు, పుణ్యవంతులు, అతీత శక్తులు కలిగినవారు, జ్ఞానసంపన్నులు అయిన బుద్ధులకే మరణం సంభవించిందంటే ఇకనావంటి వారి సంగతేమని చెప్పాలి?
7. మరణం రావడానికి ఎంతో కాలం పట్టదు. ఇది అనివార్యమైనది. ఆభ్యంతర బాహ్యములనే నానావిధ ఉపద్రవాలతో ప్రతీక్షణం మరణిస్తున్న నేను ఒకరెప్పపాటు కాలంలో అంటే ఏక్షణమైనా మరణించవచ్చు.

## అశుభానుస్మృతి

(నశ్వర శరీరంపై ధ్యానము)

1. ఈ శరీరం సంతృప్తినిచ్చేది కాదని, తనను తాను తెలుసుకొనగలిగేదని, తెలుసుకొనలేనిదని దీని గురించి తెలుసుకొని మానవుడు దీని అశుభత్వం పై (నశ్వరత్వంపై) ధ్యానించాలి.
2. శరీరపు రంగు, రూపు, వాసన, దానితో కూడుకొని ఉన్న తత్వాలు, దాని ఆకాశము, వీటికి సంబంధించిన 32 విధాలైన అపవిత్ర మలములు చాలా అసహ్యమైనవి.
3. శరీరాంతర్గతమైన మలములు ఇంకా అసహ్యమైనవి. ఇవి శరీరం నుండి చ్యుతములయ్యే వాటికన్నా అసహ్యమైనవి. ఎందుకంటే శరీరం నుండి బయల్వెడలే మలములు శరీరంతో ఎప్పుడూ కలిసి ఉండవు. ఈ శరీర మెల్లప్పుడూ మలములపైనే ఆధారపడి నటువంటిది.

4. మిళ్హే క్రిమివ కాయోయం
అసుచిమ్హి సముట్ఠితో
అన్తో అసుచి సమ్పున్నో
పున్న వచ్చ కుటి వియ.

5. అసుచి సన్దటే నిచ్చం
యథా మేదక థాలికా
నానాకిమి కులూవాసో
పక్క చన్దనికా వియ.

6. గన్ధభుతో రోగభుతో
వనభుతో సముస్సయో
అతెకిచ్ఛోతి జేగుచ్ఛో
పభిన్న కునపుపమో'తి.

## సల్లసుత్తము

1. అనిమిత్త మనఞ్ఞాతం
మచ్చానం ఇధ జీవితం
కసిరం చ పరిత్తం చ
తం చ దుక్ఖేన సన్యుతం.

2. న హి సో ఉపక్కమో అత్థి
యేన జాతా న మీయరే
జరమ్పి పత్వా మరనం
ఏవం ధమ్మా హి పానినో.

4. మురికిలో పుట్టిన క్రిమిలా ఈ శరీరం కూడా మురికిలోనే పుడుతుంది. దుర్గంధ భూయిష్టమైన మలకూపంలా ఈ శరీరం అశుద్ధంతో నిండినట్టిది.

5. కొవ్వు కుండ నుండి కొవ్వు బయటికి స్రవించినట్లు, ఈ శరీరం నుండి కూడా రకరకాలైన అశుద్ధ పదార్థాలు బయల్వెడలుతాయి. మలకూపంలా ఈ శరీరం కూడా లక్షలాది క్రిములకు నెలవైనది.

6. ఈ శరీరం ఒక రోగం లాంటిది, నివారణలేని పుండు లాంటిది. చాలా అసహ్యమైనది. ఇది కుళ్ళిపోయిన శవంలాంటిది.

## శల్యసుత్తము

1. లోకంలో ఈ మనుష్యుల జీవితానికి కారణమేమిటో తెలియదు. అసలు ఈ జీవితమేమిటో అర్థం కాదు. ఇదెంతో క్షణికమైనది, అనిత్యమైనది, దుఃఖయుక్తమైనది.

2. మానవుడీలోకంలో ఒక్కసారి పుట్టాడంటే, ఇక అతడు మరణం నుండి తప్పించుకొనే ఉపాయం లేదు. మనుష్యులకు ముసలితనం రావడం, తరువాత మరణించడం తప్పనిసరి.

3. ఫలాన మివ పక్కానం
పాతో పతనతో భయం
ఏవం జాతాన మచ్చానం
నిచ్చం మరనతో భయం.

4. యథాపి కుమ్భకారస్స
కత మట్టిక భాజనా
సబ్బే భేదన పరియన్తో
ఏవం మచ్చాన జీవితం.

5. దహరా చ మహన్తా చ
యే బాలా యే చ పండితా
సబ్బే మచ్చు వసం యన్తి
సబ్బే మచ్చు పరాయణా

6. తేసం మచ్చు పరేతానం
గచ్ఛతం పరలోకతో
న పితా తాయతే పుత్తం
ఞాతి వా పన ఞాతకే.

7. పేక్ఖ తం యేవ ఞాతీనం
పస్సలాలపతం పుథు
ఏకమేకోవ మచ్చానం
గోవజో[illegible]వియ నీయతి.

8. ఏవమబ్భాహతో లోకే
మచ్చునా చ జరాయ చ
తస్మా ధీరా న సోచన్తి
విదిత్వా లోక పరియాయం.



3. పం
మః
భం

4. కుః
మః

5. చిన
పాః

6. తాః
వైప
ఏ

7. గోవ
బం
మ్మ

8. జర
ప్రప
ధీర

3. పండిన పండ్లు చెట్లమీది నుండి ఎప్పుడుపడతాయోనన్న సందేహం మనిషినెలా పట్టి పీడిస్తుందో అలాగే తానెప్పుడు మరణిస్తానో నన్న భయము ప్రాణిని ప్రతిక్షణం పీడిస్తుంది.

4. కుమ్మరివాడు చేసిన మట్టి పాత్రలు పగిలేంత వరకే ఉంటాయి. మనుష్యుల జీవితం కూడా మరణం వరకే ఉంటుంది.

5. చిన్నవాళ్ళు, పెద్దవాళ్లు, మూర్ఖులు, పండితులు, అందరూ మృత్యువు పాలుకాక తప్పదు. అందరూ మృత్యుముఖం లోనికి ప్రవేశించేవారే.

6. తానే స్వయంగా మృత్యువాతన పడి ఈ లోకాన్ని వదిలి పరలోకం వైపు పయనం సాగించే ఏ తండ్రీ తన కొడుకును రక్షించుకొనలేడు. ఏ బంధువూ తన బంధువును రక్షించుకొనలేడు.

7. గోవులను కసాయివాడు వధ్యశాలకు తీసుకువెళ్ళినట్లు తమ బంధువులంతా దీనంగా చూస్తుండగా మనుష్యుల నందరినీ ఈ మృత్యువు ఎలా తీసుకెళ్ళుతున్నదో చూడు.

8. జరామరణాలతో లోకమంతా ఇలా అభ్యాహతమైనది. అందుకే ప్రపంచ స్వభావాన్ని, దాని గమనాన్ని బాగా అర్థం చేసుకున్న ధీరులు అసలు శోకించరు.

9. యస్స మగ్గం న జానాసి
ఆగతస్స గతస్స వా
ఉభో అన్తే అసంపస్సం
నిరత్థం పరిదేవసి.

10. పరిదేవయమానో చే
కిన్చిదత్థం ఉదబ్బహే
సమ్మూళ్హో హిన్స మత్తానం
కయిరా చే తం విచక్ఖనో.

11. నహి రున్నేన సోకేన
సన్తిం పప్పోతి చేతసో
భియస్సు - ప్పజ్జతే దుక్ఖం
సరీరం - చుపహఞ్ఞా తి.

12. కిసో వివన్నో భవతి
హిన్స మత్తాన మత్తనా
న తేన పేతా పాలేన్తి
నిరత్థా పరిదేవనా.

13. సోకమప్పజహం జన్తుం
భీయో దుక్ఖం నిగచ్ఛతి
అనుత్థునన్తో కాలకతం
సోకస్స వసమన్వగు.

14. అఞ్ఞేపి పస్స గామినో
యథా కమ్ముపగే నరే
మచ్చునో వస మాగమ్మ
ఫన్దన్తే విధ పానినో.

9. లోక
వారి

10. ఒక
ప్రా

11. దు:
ఇం

12. శోక
విషీ
నిర

13. ప్రా
శో
పో

14. ఇ
చు
క



9. లోకులెక్కడినుండి వచ్చారో, తిరిగి ఎక్కడికెళతారో తెలియని నీవు వారి గురించి అనవసరంగా దుఃఖపడుతున్నావు.

10. ఒకవేళ దుఃఖ పడడం వల్లనే లోకంలోని దు:ఖాలు నశిస్తే ప్రాజ్ఞులు మోహవశులై దుఃఖపడేవారు.

11. దు:ఖపడడంచేత మానసిక శాంతి లభించదు. పైగా వారి దు:ఖం ఇంకా పెరుగుతుంది. శరీరం బాగా అలసిపోతుంది.

12. శోకం మనిషిని శుష్కింపజేస్తుంది. అతడి ముఖం కాంతి విహీనమైపోతుంది. శోకం పోయిన వారిని ఉద్ధరించదు. శోకం నిరర్థకమైనది.

13. ప్రాణి శోకాన్ని వదలకపోతే మరింత దు:ఖాలపాలౌతాడు. అతడు శోకానికి మరింత వశుడౌతాడు. దానిలో మరింతగా కూరుకుని పోతాడు.

14. ఇతరులీ లోకంలో వారివారి కర్మలననుసరించి ఎలా జన్మిస్తున్నారో చూడు. వారంతా మృత్యువుకు వశులై మృత్యుభయంతో కమ్పించవలసిందే.

15. యేన యేనహి మఞ్ఞన్తి
తతో తం హోతి అఞ్ఞథా
ఏతాదిసో వినాభావో
పస్స లోకస్స పరియాయం.

16. అపి చే వస్ససతం జీవే
భీయో వా పన మానవో
ఞాతి సంఘా వినా హోతి
జయతి ఇధ జీవితం

17. తస్మా అరహతో సుత్వా
వినేయ్యా పరిదేవితం
పేతం కాలకతం దిస్వా
న సో లబ్భా మయా ఇతి.

18. యథా సరన మాదిత్తం
వారినా పరినిబ్బుతో
ఏవమ్పి ధీరో సప్పఞ్ఞో
పణ్డితో కుసలో నరో.
ఖిప్పముప్పతితం సోకం
వాతో థూలం వ ధన్సయే.

19. పరిదేవ పజప్పఞ్చ
దోమనస్సఞ్చ అత్తనో
అత్తనో సుఖ మేసానో
అబ్బహే సల్లమత్తనో

20. అబ్బుల్హ సల్లో అసితో
సన్తిం పప్పుయ్య చేతసో
సబ్బసోకం అతిక్కన్తో
అసోకో హోతి నిబ్బుతో

15. లోకంలో మనమొక విధంగా ఆలోచిస్తే, మరోవిధంగా జరుగుతుంది. పరిస్థితుల వ్యతిరేక స్వభావం అలాంటిది. ఈ ప్రపంచ స్వభావమే అలాంటిదని గమనించు.

16. మనిషి వందసంవత్సరాలు జీవించినా, అంతకన్నా ఎక్కువ జీవించినా చివరకు లోకంలో జీవితమే జయిస్తుంది. అతడు మాత్రం తన బంధు మిత్రులను వదలి వెళ్ళిపోవలసిందే.

17. కాబట్టి జ్ఞానులైన అర్హతుల ఉపదేశాలు విని, నిజాన్ని తెలుసుకొని, మనిషి శోకాన్ని నియంత్రించుకోవాలి. చనిపోయిన వారిని చూసి వారిక రారు అన్న సంగతిని తెలుసుకొని శోకాన్ని దిగమ్రింగుకోవాలి.

18. తగలబడే ఇంటిని యజమాని నీటితో చల్లార్చినట్లు, సమ్యక్ ప్రజ్ఞను పొంది, నిపుణుడైన ధీరమానవుడు కూడా దహించే దు:ఖాలను ఉపశమింపజేయాలి. పెనుగాలి పత్తిని ఒక్కసారిగా లేపివేసినట్లు వచ్చిన శోకాన్ని త్వరగా నిర్మూలించాలి.

19. సుఖం కావాలనుకుంటే, మనిషి తాను స్వయంగా నాటుకున్న దుఃఖ శల్యాన్ని బాధకలిగినా, శోకంవచ్చినా ఆక్రందనతో పెరికివేయాలి.

20. ఈ దుఃఖశల్యాలను బయటికి లాగి, మానసిక శాంతిని పొంది, అన్ని రకాల దుఃఖాలనధిగమించి, శోకరహితుడై మానవుడు చివరికి నిర్వాణాన్ని పొందుతాడు.

## తిలక్ఖనాని

1. సబ్బే సఙ్ఖారా అనిచ్చాతి
యదా పఞ్ఞాయ పస్సతి
అథ నిబ్బిన్దతి దుక్ఖే
ఏస మగ్గో విసుద్ధియా.

2. సబ్బే సఙ్ఖారా దుక్ఖాతి
యదా పఞ్ఞాయ పస్సతి
అథ నిబ్బిన్దతి దుక్ఖే
ఏస మగ్గో విసుద్ధియా

3. సబ్బే ధమ్మా అనత్తాతి
యదా పఞ్ఞాయ పస్సతి
అథ నిబ్బిన్దతి దుక్ఖే
ఏస మగ్గో విసుద్ధియా.

# త్రిలక్షణములు

1. మనిషి తన ప్రజ్ఞతో లోకంలోని అన్ని సంస్కారములు అనిత్యములని తెలుసుకుంటే సర్వదు:ఖాలను సులభంగా అధిగమించగలుగుతాడు. ఇదే పవిత్రమైన మార్గము.

2. మనిషి తన ప్రజ్ఞతో లోకంలోని అన్ని సంస్కారాలు దు:ఖయుక్తమని తెలుసుకుంటే సర్వదు:ఖాలను అధిగమించ గలుగుతాడు. ఇదే పవిత్రమైన మార్గము.

3. మనిషి తన ప్రజ్ఞతో లోకంలోని అన్ని సంస్కారాలు అనాత్మ అని తెలుసుకుంటే సర్వదు:ఖాలను అధిగమించ గలుగుతాడు. ఇదే పవిత్రమైన మార్గము.

## పియేహి విప్పయోగో

1. ధఞ్ఞం ధనం రజతం జాతరూపం
పరిగ్గహం చాపి యదత్థి కించి
దాసా కమ్మకరా పేస్సా
యే చస్స అనుజీవినో.

2. సబ్బం ఆదాయ గన్తబ్బం
సబ్బం నిక్ఖిప్పగామినం
యం చ కరోతి కాయేన
వాచాయ ఉద చేతసా

3. తం హి తస్స సకం హోతి
తం చ ఆదాయ గచ్ఛతి
తం చస్స అనుగం హోతి
ఛాయావ అనపాయిని.

4. సబ్బే సత్తా మరిస్సన్తి
మరణన్తమ్హి జీవితం
యథా కమ్మం గమిస్సన్తి
పుఞ్ఞపాప ఫలూపగా
నిరయా పాపకమ్మన్తా
పుఞ్ఞ కమ్మా చ సుగ్గతిం.

5. తస్మా కరేయ్య కల్యానం
నిచయం సమ్పరాయికం
పుఞ్ఞాని పరలోకస్మిం
పతిట్ఠా హోన్తి పానినం'తి

## ప్రియమైన వారు దూరమగుట

1. ధనము, ధాన్యము, వెండి, బంగారము వంటి సంపద, దాస-దాసీజనం వంటి సౌభాగ్యము..........

2. .......ఇవన్నీ ఇక్కడే వదిలేసి వెళ్ళాలి. కాని శరీరంతో, మాటలతో, మనస్సుతో చేసిన కర్మ ఫలితాలను తప్పకుండా తీసుకెళ్ళాలి.

3. అందుకే లోకంలో తనదంటూ ఏదైనా ఉంటే అది స్వీయకర్మఫలితమే. మనిషి చివరకు దాన్నే తీసుకెళతాడు. ఏనాడూ వీడని నీడలా మనిషివెంట వచ్చేదదే.

4. లోకంలోని ప్రాణులన్నీ మరణిస్తాయి. మరణంతో జీవితం ముగుస్తుంది. ప్రాణులన్నీ తమ తమ పాపపుణ్య కర్మానుసారంగా వెళ్ళిపోతాయి. పాపాలు చేసినవారు దుర్గతి పాలౌతారు. పుణ్యాలు చేసిన వారికి సద్గతి లభిస్తుంది.

5. కాబట్టి మనిషి ఎల్లప్పుడూ మంచిపనులనే చేయాలి. రాబోయే కాలాలకు పనికివచ్చేటట్లుగా సత్కర్మలను ప్రోగుచేయాలి. ప్రాణులు చేసిన పుణ్యాలే పరలోకంలోకి మనిషితో బాటుగా వెళతాయి.



మూగజీవాల ప్రాణాలను హరించాలని చూసే మానవాధములను మృత్యువెన్నటికీ వదలదు.

# జీవితం అశాశ్వతమైనది మరణమే శాశ్వతమైనది.

(అంత్యేష్ఠి సమయంలో పఠించదగినది.)

బౌద్ధులంతా మృత్యువు అనివార్యమైనదని గమనించాలి. వారు ఈ సత్యాన్ని శాంతంగా ఒప్పుకొని అంత్యేష్టి సమయంలో గతించిన వారి పట్ల దయార్ద్ర భావాన్ని పెంపొందించుకోవాలి. అంత్యక్రియలు జరుగుతున్నప్పుడు కుటుంబ సభ్యుల భయాన్ని పోగొట్టడానికి ఈ గాథలను పఠించాలి. మిగతా గాథలు చనిపోయిన వారికి పుణ్యం సంక్రమించి వారికి శాంతి చేకూరడానికి పఠించాలి.

ఈ సుత్తంలోని గాథలను బౌద్ధదేశాలలో భయాందోళనలు తొలిగి సురక్షిత భావం కలగడానికి పఠిస్తారు. ఏడుస్తున్న వారిని ఓదార్చడానికి కూడా వీటిని చదవచ్చు. ఈ గాథలను చదవడం వల్ల మనుష్యులు జననమరణాల సహజస్వభావాన్ని కూడా తెలుసుకొనగలుగుతారు.

## జీవితం అసస్సతం మరనం సస్సతం

1. అనిచ్చా వత సఙ్ఖారా
ఉప్పాద వయ ధమ్మినో
ఉప్పజ్జిత్వా నిరుజ న్తి
తేసన్వూపసమో సుఖో

2. అచిరం వత అయం కాయో
పఠవిం అధిసేస్సతి
ఛుద్ధో అపేత విఞ్ఞానో
నిరత్థం వ కలిఙ్గరం

3. అనబ్భితో తతో అగ
అననుఞ్ఞాతో ఇతో గతో
యథా' గతో తథా గతో
కా తత్థ పరిదేవనా?

4. పుత్తా మత్థి ధనం-అత్థి
ఇతి బాలో విహఞ్ఞతి
అత్తా హి అత్తనో నత్థి
కుతో పుత్తా కుతో ధనం?

## జీవితం అశాశ్వతమైనది - మరణమే శాశ్వతమైనది

1. అన్ని సంస్కారములు అనిత్యమైనవి. ఉత్పత్తి నాశనములు ఆ సంస్కారముల సహజధర్మము. అవన్నీ ఉత్పన్నములై (పుట్టి) నిరుద్ధములౌతాయి (నశిస్తాయి) వాటిని నిరోధించడం ద్వారానే సుఖం లభిస్తుంది.

2. క్షుద్రమై, చైతన్యశూన్యమై ఈ దేహము కొద్దికాలంలోనే ఒక పనికిరాని మొద్దులా పుడమిపై పడిపోతుంది.

3. మనిషి అక్కడినుండి ఇక్కడికి పిలవకుండానే వచ్చాడు. తెలియకుండానే ఇక్కడి నుండి వెళ్ళిపోతాడు. ఎలా వచ్చాడో అలాగే వెళ్ళి పోతాడు. ఈ విషయంలో బాధపడాల్సిందేముంది?

4. నాకు కొడుకులున్నారు, ధనం ఉన్నది, అనుకుంటూ అజ్ఞాని తనను తాను బాధలకు గురించేసుకుంటాడు. నిజానికి తనకుతానే లేడు. (అంటే తన జీవితం ఎప్పుడు అంతరించి పోతుందో తనకే తెలియదు). ఇక కొడుకులెలా ఉంటారు? ధనమెలా ఉంటుంది? (అంటే తనే శాశ్వతం కానప్పుడు కొడుకులు, ధనము తనవాళ్ళు, తనవి అనుకోవడం అవివేకం)

## అట్ఠ మహాసంవేగ వత్థు

1. భావేత్వా చతురారక్ఖా
   ఆవజ్జేయ్య అనన్తరం
   మహాసంవేగ వత్థూని
   అట్ఠ అట్ఠిత వీరియో.

2. జాతిజరా వ్యాధి చుతి అపాయా
   అతీత అప్పత్తక వత్తదుక్ఖం
   ఇదాని ఆహార గవేట్ఠి దుక్ఖం
   సంవేగ వత్థూని ఇమాని అట్ఠ.

3. పాతో చ సాయ మపి చేవ ఇమం విధిఞ్ఞూ
   ఆసేవతే సతత మత్త హితాభిలాసి
   పప్పోతి సోతి విపులా హతపారిపన్థో
   సేట్ఠం సుఖం మునివిసిట్ఠమతం సుఖేన చాతి.

# అష్ట మహాసంవేగ వస్తు

(జీవితంలోని ఎనిమిది బాధాకర సన్నివేశాలను మననం చేసుకోవడం)

1. నాలుగు విధాల రక్షణ నిచ్చే ధ్యానాన్ని ఆచరించి మనిషి ప్రయత్నశీలుడై జీవితంలోని ఎనిమిది దుఃఖమయ సన్నివేశాల గురించి ఆలోచించాలి.

2. పుట్టుక, ముసలితనము, వ్యాధి, మరణము, ప్రేతలోకము, గతంలోని భవచక్రము, రాబోయే భవచక్రము, బ్రతుకు తెరువు వెతుకులాటలో ఈ జన్మలో పడ్డ బాధలు; ఇవి జీవితంలోని ఎనిమిది దుఃఖమయ సన్నివేశాలు.

3. తన క్షేమాన్ని కోరుకొనే మనిషి ధ్యాన ప్రకారాలను తెలుసుకొని ఉదయము, సాయంత్రము, నియమం తప్పక ఈ ధ్యానాన్ని అభ్యాసం చేస్తే అతడు సర్వవిఘ్నాలను ధ్వంసం చేసి సర్వమంగళాలను పొంద గలుగుతాడు. అతడు దుఃఖాన్ని జయించి బుద్ధుడి చేత ప్రశంసించబడిన నిర్వాణాన్ని పొందగలుగుతాడు.

## పుఞ్ఞానుమోదనా

1. ఆకాసట్ఠా చ భుమ్మట్ఠా
దేవా నాగా మహిద్ధికా
పుఞ్ఞం తం అనుమోదిత్వా
చిరం రక్ఖన్తు సాసనం.

2. ఆకాసట్ఠా చ భుమ్మట్ఠా
దేవా నాగా మహిద్ధికా
పుఞ్ఞం తం అనుమోదిత్వా
చిరం రక్ఖన్తు దేసనం

3. ఆకాసట్ఠా చ భుమ్మట్ఠా
దేవా నాగా మహిద్ధికా
పుఞ్ఞం తం అనుమోదిత్వా
చిరం రక్ఖన్తు మం పరం

4. ఏత్తావతా చ అమ్హేహి
సమ్భతం పుఞ్ఞసమ్పదం
సబ్బే దేవా అనుమోదన్తు
సబ్బసమ్పత్తి సిద్ధియా

5. ఏత్తావతా చ అమ్హేహి
సమ్భతం పుఞ్ఞసమ్పదం
సబ్బే భూతా అనుమోదన్తు
సబ్బసమ్పత్తి సిద్ధియా

# పుణ్యానుమోదన

(పుణ్యములను పంచుకోవడం)

1. ఆకాశంలో, భూమిమీద ఉన్న శక్తిమంతులైన దేవతలు, నాగులు సత్కర్మల ద్వారా సంప్రాప్తించిన ఈ పుణ్యములను అంగీకరించి బుద్ధశాసనాన్ని చిరకాలము రక్షింతురుగాక.

2. ఆకాశంలో, భూమిమీద ఉన్న శక్తిమంతులైన దేవతలు, నాగులు సత్కర్మల ద్వారా సంప్రాప్తించిన ఈ పుణ్యములను అంగీకరించి బుద్ధోపదేశములను చిరకాలము రక్షింతురుగాక.

3. ఆకాశంలో, భూమిమీద ఉన్న శక్తిమంతులైన దేవతలు, నాగులు సత్కర్మల ద్వారా సంప్రాప్తించిన ఈ పుణ్యములను అంగీకరించి నన్ను, ఇతరులను రక్షింతురుగాక.

4. దేవతలు మేము సముపార్జించిన పుణ్యసంపదనంతా అంగీకరింతురుగాక. దానితో మాకు సర్వ సమ్పత్తులు సిద్ధించుగాక.

5. సర్వప్రాణులు మేము సముపార్జించిన పుణ్యసంపదనంతా అంగీకరించుగాక. దానితో మాకు సర్వ సమ్పత్తులు సిద్ధించుగాక.

6. ఏత్తావతా చ అమ్హేహి
సమ్భతం పుఞ్ఞ సమ్పదం
సబ్బే సత్తా అనుమోదన్తు
నిబ్బాన సమ్పత్తి సిద్ధియా

7. ఇదం మే ఞాతీనం హోతు
సుఖితా హోన్తు ఞాతయో!

8. ఇదంమే ఞాతీనం హోతు
సుఖితా హోన్తు ఞాతయో

9. ఇదం మే ఞాతీనం హోతు
సుఖితా హోన్తు ఞాతయో

సఙ్కప్పో

1. ఇమినా పుఞ్ఞ కమ్మేన
మా మే బాలా సమాగమో
సతం సమాగమో హోతు
యావ నిబ్బానపత్తియా.

6. వివేకము గలిగిన సర్వప్రాణులు దేవతలు మేము సముపార్జించిన పుణ్యసంపదనంతా అంగీకరింతురుగాక. దానితో మాకు నిర్వాణ సమ్ప్రత్తి సిద్ధించుగాక.

7. నా బంధువులకు కూడా ఈ పుణ్యము లభించుగాక. నాబంధువులంతా సుఖసంతోషాలతో జీవింతురుగాక.

8. నా బంధువులకు కూడా ఈ పుణ్యము లభించుగాక. నాబంధువులంతా సుఖసంతోషాలతో జీవింతురుగాక.

9. నా బంధువులకు కూడా ఈ పుణ్యము లభించుగాక. నాబంధువులంతా సుఖసంతోషాలతో జీవింతురుగాక.

## సంకల్పము

ఈ సత్కర్మల వల్ల నాకు ఎన్నడు కూడా మూర్ఖులతో స్నేహం ఏర్పడకుండుగాక. నిర్వాణం సిద్ధించేంతవరకు సజ్జనులతోనే మైత్రి నెలకొనుగాక.